# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాసపత్రిక

సంపాదకుఁడు :
డాక్టరు కే. యన్. కేసరి

# GRIHALAKSHMI

మార్చి, 1948.

సంపుటము ౧౭]  [సంచిక 3




## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒక్కేవక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# శ్రీ సర్వజిత్ నామ సం॥ర ఫాల్గుణ మాసము

| | | | |
|---|---|---|---|
| | 11 | గు | పా. 53 12 పూ. భా 19.39 రా 16.4 శిశిరలక్ష్మీవ్రతం. |
| | 12 | శు | వి. 55-59 ఉ. భా 4-11 రా. 26-20 చంద్రోదయం. సత్యబోధతీర్థపుణ్యదినం. |
| | 13 | శ | త. 57-19 రే. 27-36 శే. త్య 1-4 |
| | 14 | ఆ | చ. 57-41 అశ్వ. 30-0 రా. 24-30 |
| | 15 | సో | పం. 56-18 భ. 31-1 సత్యవర తీర్థపుణ్యదినం |
| | 16 | మం | ష. 54-5 కృ 30-వి. 33-4 కుమారషష్ఠి |
| | 17 | బు | స. 50-37 రో. 29-30 రా. 13-14 |
| మార్చి | 18 | గు | అ. 46-13 మృ. 27-16 రా. 17-20 శ్రీ విరూపాక్షవిద్యారణ్యభారత్యారాధనం. |
| | 19 | శు | న. 41-12 ఆ. 24-19 రా. 22-41 |
| | 20 | శ | ద 35-51 పు. 20-49 |
| | 21 | ఆ | ఏ. 29-51 పుష్యమి. 16-58 రా. 17-3 సర్వేషాం అమలకైకాదశి |
| | 22 | సో | ద్వా. 23-50 ఆశ్లే. రా. 0-37 తిథిద్వయం. అమలకద్వాదశి |
| | 23 | మం | త్ర. 17-40-మ. 8-37 యాడికి చెన్నకేశవస్వామి గరుడోత్సవం. కామదహనం. |
| | 24 | బు | చతు. 12-4 పూ ఫా. 4-31 ది. 2.30 గరుడోత్సవం] |
| | 25 | గు | ○ పౌ. 7.0 ఉ ఫా. 1-2 ది. 21-1 చూతకుసుమభక్షణం. [అహోబిలంనృసింహ |
| 1948-వ సం॥ | 26 | శు | పా. 2 11 ఉ పఠి. హ్వ 55-59 పెరవలి రంగస్వామి రథోత్సవం |
| | 27 | శ | త. 55-41 స్వా. 55-2 ది. 10-4 |
| | 28 | ఆ | చ. 54-3 వి. 55-6 హ. 5-2 సంకష్టహరణ గణేశవ్రతం |
| | 29 | సో | పం. 53-49 అను. 56-14 వ. 1-47 గోరంట్ల మాధవస్వామి రథోత్సవం |
| | 30 | మం | ష. 54-18 జ్యే. 58-51 |
| | 31 | బు | స 56-43 మూ. 60-0 వ. రా. 28-1 |
| | 1 | గు | అ. 59-47 మూ 2.31 త్యా. 2-52 |
| | 2 | శు | న. 60-0 పూషా. 7.37 ది. 29-30 |
| | 3 | శ | న. 4.39 ఉషా. 13 16 ది. 24-18 |
| ఏప్రిల్ | 4 | ఆ | ద. 9-16 శ్రీ. 19-39 రా. 0. |
| | 5 | సో | వి. 14-30 ధ 26-12 రా. 15-0 సర్వేషాం ఏకాదశి |
| | 6 | మం | ద్వా. 19-37 శ. 32 40 రా. 19.20 (శూన్యతిథిః) |
| | 7 | బు | త్ర. 24-27 పూభా. 38-25 మాస శివరాత్రిః |
| | 8 | గు | చతు. 28-2 ఉ భా. 43-18 ది. 4-34 |
| | 9 | శు | ● అమా. 30-39 రే. 27-10 రా. 30-39 (అమా తర్పణం) |
| | 10 | శ | శ్రీ సర్వధారినామ సం॥ చైత్రశుద్ధపాడ్యమి-తెలుగుసవంత్సరాది పండుగ. |

# విషయసూచిక



స్వర్ణకంకణ గృహీత



స్వర్ణకంకణ ప్రదాత.



శ్రీ శారదా నికేతనంలో ఉపాధ్యాయినీ వర్గం.



గృహాలక్ష్మి జయంత్యుత్సవమునకు విచ్చేసిన నారీమణులు.
అధ్యక్షురాలు శ్రీసరస్వతి చెన్న కేశవన్ గారు పుష్పమాలాలంకృతులై మధ్య కూర్చొనియున్నారు.




# గృహాలక్ష్మి జయంత్యుత్సవము

## స్వర్ణకంకణప్రదానోత్సవము



ఈ రెండుఉత్సవములున్నూ, ఈ సంవత్సరమును జయప్రదముగా ఈ 7-3-48 తేదిన జరుపబడినందులకు మిక్కిలి సంతోషించుచున్నాము.

ప్రతిసంవత్సరముకన్నను ఈ సారిజరిగిన ఉత్సవములు విలక్షణమైనవి. సుమారు 5 సంIIలుగా ఈ ఉత్సవములుజరుగుట "గృహాలక్ష్మి" పత్రికా ప్రచురణము విరమించుట తోపాటు నిలిచిపోయియుండెను. గతసంవత్సరారంభమునతిరిగీ ఆపత్రిక నారంభించగా ఈ సంIIమున నీఉత్సవములు రెండున్నూ తిరిగీజరుపుట తటస్థించినది.

రెండవది : ప్రతిష్టా, కావ్యరచన, పత్రికాప్రచురణ, విద్యావ్యాపకం, చిత్రలేఖనం మొదలైన వానిద్వారా స్త్రీసేవగావించిన విదుషీమణులలో ఒక్కరికి ఈ కంకణమివ్వబడు చుండెడిది. ఈసారిఅట్లుగాదు. భారతభాగవతాది ప్రాచీన భారతీయసంస్కృతియందు విద్యా బుద్ధులనేర్చి, స్వయముగా లోకానుభవముచే ఆధునికకాలమున స్త్రీల అవసరముల గుర్తెరింగి, తనజ్ఞానమును, అనుభవమును సాటిస్త్రీల సాంఘిక, వైజ్ఞానిక, రాజకీయోన్నతులకై నిరంతరము వినియోగించుచు సర్వతోముఖ స్త్రీసేవా పరతంత్రయైయున్న యొకవృద్ధురాలి కొసంగబడినది. మరి ఇదివరలో కంకణమును స్వీకరించినవారు దానిని తమ కరముల నలంకరించుకొనిరి. నేడు కంకణాగృహీతయైన శ్రీమతి వున్నవ లక్ష్మీబాయమ్మగారో, ఏనాడో బంగారముధరించనని శపథముపట్టియున్నందున తనసేవ కాకరమైన శారదా నికేతనమున శాశ్వతచిహ్నముగా దానిని నిక్షేపించుచున్నారు.

# గృహలక్ష్మి జయంత్యుత్సవము

# స్వర్ణకంకణప్రదానము

## గృహీత : శ్రీమతి ఉన్నవ లక్ష్మిబాయమ్మగారు



7-3-48 తేది ఆదివారము నాడు కేసరికుటీరము భవనమున—"గృహలక్ష్మి" జయంత్యుత్సవమును, శ్రీమతి ఉన్నవ లక్ష్మిబాయమ్మగారికి-స్వర్ణకంకణ ప్రదానమును అతివైభవముగా జరుపబడినవి. శ్రీమతి లక్ష్మిబాయమ్మగారు వ్యాధిగ్రస్తురాలైయున్నందున ఆమెతరపున శ్రీ ఉన్నవ లక్ష్మినారాయణ పంతులుగారు వచ్చి కంకణముస్వీకరించిరి. పచ్చయప్పకళాశాలయందు అధ్యాపకురాలు-శ్రీమతి సరస్వతి చెన్నకేశవన్ గారు ఎం. ఏ. అధ్యక్షతవహించి అతికౌశల్యమున సభావ్యవహారమంతయు నడిపించిరి.

సాయంకాలము నాలుగుగంటలకే శ్రీమతి అమ్మన్నరాజా, వసుంధరాదేవి, యామినీపూర్ణతిలకమ్మ, శ్రీ వేపారామేశం, విస్సా అప్పారావు, మైదవోలు శేషాచలపతి, భావరాజు కృష్ణారావు, కవికొండల బ్రహ్మయ్యపంతులు ప్రభృతులు సభ నలంకరించిరి. సభాసదస్యులను, కేసరికుటీరపు సింహద్వారముననే, శ్రీ కేసరిగారును, కుటీరము మానేజరు శ్రీ డా. శేషగిరిరావుగారును - మందహాసముల నెదుర్కొని, చందన పుష్పగుచ్ఛముల సత్కరించి లోనికి పిల్చుకొనివచ్చి ఆసీనులగావించిరి.

తొలుత ఉత్సవమునకు వచ్చిన నారీమణులతో ఛాయాపటమొక్కటి గైకొనబడెను. ఆ పిదప అందరు సభనలంకరించిరి. బాగుగా నలంకరించిన భవనముహాలులో చెన్నపురిలోనివసించువారు సుమారు 300 మంది ఆంధ్రపురంధ్రీమణులును, అంతకించుమించు పురుషపుంగవులును సభ కిటకిటలాడ సమావేశమై ఉత్సాహవ్యగ్రులైయుండుట చూడ కన్నులపండువుగనుండెను. వయోవృద్ధులు, వ్యాధిగ్రస్థులునయ్యు శ్రీ కేసరిగారుత్సాహాతిశయమున ఉత్సవ వ్యవహారములన్నింటని స్వయముగతిరిగి కనుగొనుట, ఉత్సవ నిర్వాహకుల కెంతయో ప్రోత్సాహజనకముగనుండెను.

పుష్పమాలాలంకృతమైన గాంధీమహాత్ముని పటము-సభావేదిక పైభాగముననుండుట సభకొక్క పవిత్రవాతావరణమును చేకూర్చినది.

---

పాపమామె వ్యాధిగ్రస్తురాలై ఉత్సవమునకు స్వయముగా రాజాలదాయెను. అయిన నామెకన్నివిధముల నండయు ప్రోత్సాహమునైయున్న ఆమెభర్త శ్రీ లక్ష్మినారాయణ పంతులుగారు దయతోవిచ్చేసి ఆ కంకణము నామెతరఫున స్వీకరించినందుల కభివందనీయులు. శ్రీ లక్ష్మిబాయమ్మగారు అచిరకాలంలో ఆరోగ్యవంతురాలై చిరకాలము శారదానికేతనము నడిపి దానికొక శాశ్వతత్వము చేకూర్తురుగాక. ఇట్లే ఈ యుత్సవముల నేటేట జరుపుచు స్త్రీ జనోద్ధరణముసలుప ఈశ్వరుడు శ్రీ కేసరిగారి నితోధికాయురారోగ్యైశ్వర్యము లొసంగి బ్రోచుగాక. — రా॥ వెం॥

## సభా ప్రారంభము

సభాప్రారంభమున శ్రీ కేసరీ హైస్కూలు విద్యార్థినులు ప్రార్థనకీర్తనలపాడిరి. ఆ పిదప శ్రీరామచంద్రుని వెంకటప్పగారు - శ్రీమతి సరస్వతి చెన్నకేశవకౌగారిని సభాధ్యక్షత వహింపుడనికోరి సభాసదుల హర్షవాచక కరతాళధ్వనులమధ్య ఆమె అట్లగ్రాసన మలంకరించిన వెంటనే – సభనుపక్రమించుచు ఇట్లునుడివిరి.

భారతదేశంలో పూర్వము స్త్రీలకు విద్యా, వ్యావహారిక స్వాతంత్ర్యములుండేవి. మహమ్మదీయుల రాకతో వారు ఇల్లువిడిచి రాజాలని పరిస్థితులేర్పడినవి. తుదకా ఆచారమే స్త్రీలస్వేచ్ఛ నరికట్టినది. అయితే ఆంగ్లరాజ్యముస్థిరపడగానే వారిభాష, సాంప్రదాయములు అలవడుకొలది స్వాతంత్ర్యేచ్ఛ కలిగి, సగముజనాభాయైన స్త్రీలకున్నూ, సాంఘికాది స్వాతంత్ర్యము కోరబడనది. ఇందుకై గత శతాబ్దారంభమునుండియే పలువురు పాటుపడుతూవచ్చారు. ఈ శతాబ్ధారంభంనుండి ఈ పనిపూని పాటు పడువారిలో వున్నదంపతులు ముఖ్యులు.

శ్రీ లక్ష్మీనారాయణపంతులుగారు గాంధీమహాత్ముడును చేయలేనిపని చేసినారు; అది తనభార్యకు విద్యచెప్పుటయే. నాటినుండి వారు ఆమెకు తోడునీడయై వివిధ స్త్రీజనోద్ధరణోద్యమముల తోడ్పడుచున్నారు. ఇంతలో గాంధీమహాత్ముని శంఖారవము విన్పించెను. ఆశంఖారవము-పరశువేదివలె ఎన్నో ఇనుపముక్కలను బంగారుకణికెలు గావించినది. అయితే శ్రీ లక్ష్మీబాయమ్మగారు స్త్రీజన సేవయందప్పటికే కాకలుదీరి వన్నెకెక్కియున్నారు. అంత నాదంపతులిర్వురు రాజకీయయోద్యమమున దుమికిరి. శ్రీ లక్ష్మీనారాయణపంతులుగారు తొలుతగా ఆంధ్రదేశమున నిర్బంధింపబడిరి. ఆమె నాటనుండి యావదాంధ్రదేశమును తిరిగి బ్రహ్మాండమగు ప్రచారముగావించినది. సహాయనిరాకరణోద్యమ విముఖులైన పెద్దలెందరికో - "ఆమె-గాజులు తొడుగుకొండి" అని వానిని బహూకరించి పౌరుష మెక్కించెడిది. ఆ పిదప 1922 లో శ్రీ లక్ష్మీనారాయణపంతులుగారు జైలునుండివచ్చినపిదప పూర్వము తమచేనిర్వహింపబడుచుండినదేయైన యొకబాలికాపాఠశాలను చేపట్టి-దానిని శారదానికేతనముగా మార్చిరి. ఆశారదానికేతనము 25 సం॥ లుగా అవిచ్ఛిన్నముగా వీరిరువురిచే నిర్వహింపబడి - నేడు రజితోత్సవమున శాశ్వతత్వము సాధింప నుద్యమించి యున్నది.

శ్రీ లక్ష్మీబాయమ్మగారు భర్తవల్ల భారతముపఠించిరి. ఉభయులకు భారతమన్న ఎంతప్రీతియో. వారి ఏకైకపుత్రునికి 'అర్జునరావు' అని పేరుపెట్టుకొనిరి.

శ్రీ లక్ష్మీబాయమ్మగారు వ్యాధిగ్రస్థురాలైయుండుటచే రాజాలమి శ్రీ లక్ష్మీనారాయణపంతులుగారే వారితరఫున విచ్చేసినారు.; వారిరువురుకలిసియే ప్రజాహితకార్యములను చేయుచున్నారు. అందెవరికార్యమెంతయని విడదీయరాదు. కావున ఈ కంకణముధరింప లక్ష్మీబాయమ్మగారికెంత అర్హతో వారికిన్నీ అంత హక్కున్నది. శ్రీపంతులుగారు సాంఘికరంగమునను స్వాతంత్ర్యసమర రంగమునను చాలకృషి చేసినవారు. వారు 1922 లో తొలుదొల్త, శ్రీ చిత్తరంజనదాసుగారికన్న ముందే, శాసనసభాప్రవేశము అవశ్యకర్తవ్యమని చెప్పినవారు. అయితే. శారదానికేతన నిర్వహణాదికములందే వారిమనసులగ్నమైనది. నేడుచెన్నపట్నము ఆంధ్రరాజధాని కావలయునని ఎంతోతంటాలు పడుచున్నారు. ఈ అభిప్రాయమును

రాష్ట్రవ్యతిరేకవాదులు అనుకూలురగుటకు మార్గముగా "చెన్నపట్నముతోకూడ చెన్నపట్నంరాజధానిగా" అన్న సవరణను 1917 లో నెల్లూరు ఆంధ్రమహాసభలో శ్రీ కీ॥ శే॥ చెంగయ్యపంతులుగారు ప్రతిపాదింపగా దానిని బలపరచిన ఏకైకప్రతినిధి శ్రీ లక్ష్మీనారాయణపంతులుగారొక్కరే. అట్టి చెన్నపట్నమున ఆ చెంగయ్యపంతులుగారి ఆప్తమిత్రులు, శ్రీ కేసరిగారు, ఆ లక్ష్మీనారాయణగారి భార్యను సత్కరింప బూనుటయు వారు రాజాలమి ఆ లక్ష్మీనారాయణగారేవచ్చి స్వీకరించుటయు అయాచిత సన్నివేశము.

శ్రీ కేసరిగారివిషయము విస్తరము చెప్పనక్కరలేదు. ధనమార్జించినవారు పలువురున్నారు; కాని ఒకవంక 2 లక్షలవెచ్చించి - హైస్కూలునడుపుచు - కన్యావిద్యాలయమునకని ప్రత్యేకముగా నొకలక్ష రూపాయలను ఏకకాలమునందే, సంకల్పించినంతనే - స్వార్జితమును - చెక్కువ్రాసియిచ్చి దానముచేయగల ఉదారులు ఆంధ్రదేశమందు ఎందరున్నారు? చెన్నపట్నములో తెలుగుబిడ్డలు తెలుగునేర్చుకొనుటకు వీలు లేదన్నగోలహెచ్చియున్న ఈరోజులలో 4,5వందలమంది తెలుగుబిడ్డలు ఒక్కచో తెలుగులో హైస్కూలు విద్యవరకు చదువుచున్నారనగా - ఆ స్కూలుప్రాశస్త్యము, అదానగౌరవము వేరచెప్పనక్కరలేదు. అట్టి శ్రీ కేసరిగారు నేడులక్ష్మీబాయమ్మగారిని గౌరవింపబూనుట హర్షదాయకము. ఇకసధ్యక్షురాలినిగూర్చి రెండుమాటలుచెప్పెదను. వీరినిపేరునుబట్టి తమిళులని తలంపవలదు. ఈమె శ్రీబలపాలచెన్న కేశవ(న్)రాజుగారి ధర్మపత్ని. వీరు మదనపల్లిప్రాంతములనుండి చెన్నపురికి శతాబ్దముక్రిందటనేవచ్చి నివసించుచున్న క్షత్రియులు. ఈమె ఎం. ఏ పరీక్షనిచ్చి - ఆ విద్య తనసొమ్మే చేసుకొనక - పచ్చయప్పకళాశాలలో అధ్యాపకురాలుగా విద్యాదానమొనర్చుచున్నది. శ్రీ చెన్నకేశవన్ గారును అళగప్పచెట్టి - టెక్నికల్ ఇన్స్టిట్యూట్‌లో అధ్యాపకులుగానున్నారు. కావున విద్యానిలయము నిర్వహించుచున్న దంపతులలో నారీమణిని గౌరవించుసభకు, విద్యావ్యాపకమునే కృషిచేయుచున్న దంపతులందలి స్త్రీరత్నము అధ్యక్షతవహించుట సమంజసము - ఇట్టి దాత, ఇట్టిగృహీత, ఇట్టిఅధ్యక్షురాలు, ఇట్టిసభాసదులు సమకూడియున్నసమయమున - ఎంతో కార్యకలాపము ముందుండగా-పానకములోపుడకవలె నేనునిల్చి అధికప్రసంగమొనర్చుటతగదని నన్ను నేనే మందలించుకొని దిగుచున్నాను.

అంతట సభకు రాజాలక జయప్రదముగా నెరవేరదగునని పలువురువ్రాసిన సందేశములు చదువబడెను.

అంత కంకణప్రదాతలైన శ్రీ కేసరిగారున్నూ, గృహీతకు ప్రతినిధిగావచ్చిన శ్రీ లక్ష్మీనారాయణ పంతులుగారున్నూ సభా వేదికపై అధ్యక్షురాలి కిర్వంకల నాసీనులైరి. శ్రీ కేసరిగారు లక్ష్మీనారాయణ పంతులుగారిని కరతాళధ్వనులుచెలంగ పుష్పమాలాలంకృతులగావించి ఇట్లుపన్యసించిరి:—

ఈ ఉత్సవములను నేనుకొలదికాలముగా చేస్తున్నాను. అయితే యుద్ధకారణములచే "గృహలక్ష్మి" పత్రిక నిల్చిపోవడము, దానితోపాటు ఈ కంకణప్రదానోత్సవమున్నూ నిలిచిపోవడము తటస్థించినవి. ఈ రెంటికి సంబంధముకలదు; కాబట్టే అట్లునిలిచిపోయినవి. "గృహలక్ష్మి" జయంత్యుత్సవములో నీకంకణోత్సవమొక ముఖ్యాంగముగా మొదటినుండి జరుగుచూరావడమే దీనికికారణం. గతసంవత్సరమున "గృహలక్ష్మి" పత్రికను పునరారంభించినాను. దానితోపాటు ఈసాలున యీ యుత్సవములుగూడా చేయుచున్నాను.

ఈ సంవత్సరము కంకణమును శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారికి ఇవ్వనిశ్చయించినాను. ఇంత వరకు దీనిని హెచ్చుగా కేవలము విద్యావతులకే ఇచ్చియున్నాను. ఈసారి భారత భాగవతాది భారతీయ



కంకణస్వీకరణానంతరం శ్రీ లక్ష్మీనారాయణపంతులుగారు సంభాషిస్తున్నారు.



ఉత్సవానికి విచ్చేసిన పురప్రముఖులు.

సంస్కృతినెరింగిన విద్యావతియేగాక, సంఘసంస్కరణయందు, రాజకీయములందు, విద్యావ్యాపకమునందు - ప్రజాసేవ-ముఖ్యముగ స్త్రీలసేవచేయుచున్న- లక్ష్మీబాయమ్మగారి కివ్వసంకల్పించితిని. శ్రీలక్ష్మీబాయమ్మ లక్ష్మీనారాయణ పంతులుగార్లు - 25 సం||లనుండి శారదానికేతనమును గుంటూరిలో నిర్వహించుచు స్త్రీ విద్యావ్యాప్తికై గావించున్న సేవ అందరికిన్ని తెలిసినదే. వారిసేవలో విశేషమేమనగా అనాధ బాలికలను, అజ్ఞాతజన్ములనుసహా, చేరదీసిపెంచి, విద్యాబుద్ధులనేర్పి ఉత్తమురాండ్రనుచేయు నేర్పు, ఓర్పు వారిసొమ్ము. అందుచే అట్టి లక్ష్మీబాయమ్మగారికి ఈ కంకణమిచ్చుట నాకు సంతోషదాయకము.

ఇట్లుతమకు కంకణమివ్వదలచితినని ఇటీవల శ్రీ లక్ష్మీబాయమ్మగారు చెన్నపట్నం వచ్చినప్పుడు పిలిపించి చెప్పితిని. బంగారు పెట్టుకోరాదని ప్రతిజ్ఞపట్టితిననియు, అయినను ఈ గౌరవము స్వీకరించి తమవిద్యాలయమున ఇతరబహూకృతులతోపాటు నిక్షేపింతుననియు వారుచెప్పినప్పుడు - ఈ కంకణమునకు గల్గు శాశ్వతత్వమునకు సంతసించితిని. అయితే దైవదుర్విపాకమున ఆమెపిదప జబ్బుపడినది; ఆసుపత్రిలో నున్నదట. అయినను సంకల్పించిన సత్కారము నెరవేర్చవలయుననియే తలంచితిని. ఆమెకు బదులుగా ఆమెభర్తగారు శ్రీ లక్ష్మీనారాయణపంతులుగారు దానిని స్వీకరింపనేతెంచియున్నారు. నిజమున కీసేవ యంతయు "లక్ష్మీనారాయణులు", ఆదంపతులిర్వురునూ కలిసిచేసినదే. వారుభయులలో నెవ్వరు స్వీకరించినను సమానమే.

ఇంతకూ నాముందుచెప్పినవారు వారికెందుకీ కంకణమిచ్చుచున్నానో చెప్పినారుగాని నేనెందుకీ విధానము నవలంచించితినో చెప్పలేదు. నేనుప్రథమంలో నా చిన్నతనమున రిక్తుడనై ఈ చెన్నపట్నమునకు వచ్చి బిచ్చమెత్తుకొని, వారములుచేసుకొని చదువుకొన్నాను. నా కట్టిఅవస్థలో - అక్షయముగ నాభిక్షాపాత్రనింపి, ఆప్యాయముగ నీపొట్టకుపట్టెడన్నముపెట్టి నన్నాదరించినది గృహలక్ష్మిలే. అట్టితల్లుల అమృతహస్తములకు ఏటేట బంగారుతోడాలతొడిగి, నాకృతజ్ఞత నొకకొంతవెల్లడించి సంతృప్తుడనగుచుందును. కావున సంకల్పించినరీతిగా నీ కంకణమును లక్ష్మీనారాయణపంతులుగారి కిచ్చుచున్నాను." అని కేసరి గారులేచి కంకణమిచ్చుచు - "లక్ష్మీబాయమ్మగారెందరో పురుషులకు గాజులు దానముచేయగ - నేను మీకు - బంగారు కంకణమిచ్చుచున్నాను." అని చెప్పి - సభవారు హర్షధ్వను లొనర్ప నాసీనులైరి.

లక్ష్మీనారాయణపంతులుగారు లేచి - లక్ష్మీబాయమ్మగారి తరఫున కొన్నిమాట లిట్లు చెప్పినారు:—

శ్రీ కేసరిగారు ఆంధ్రదేశంలో స్త్రీలఅభివృద్ధికై చేస్తున్నకృషి అపారము. వారు 20 సం||ల క్రితమే "గృహలక్ష్మి"ని నెలకొల్పి స్త్రీరచయితలచేత వ్యాసములువ్రాయించి ప్రకటించియు, అట్లువ్రాయ నేర్పరులైన విదుషీమణులకు ఏటేట స్వర్ణకంకణములుతొడిగియు మిక్కిలిగా ప్రోత్సహించుచున్నారు.

ఈ సంవత్సరము శ్రీమతి లక్ష్మీబాయమ్మగారికి ఈ కంకణమివ్వ సంకల్పించినారు. దీనికి కారణము ఆమె గుంటూరులో శారదానికేతనమును నడుపుచుండుటయే. (కేసరిగారు: నేనును గుంటూరుజిల్లావాడనే)

నన్నుగూర్చివారు కొన్నిప్రశంసావాక్యాలు చెప్పినారు. పూలతోచేరిన దారమునకుకూడ శిరస్సుపై ధరించడానికి యోగ్యతకలుగుతుంది; అట్లే లక్ష్మీబాయమ్మగారి సాహచర్యంవల్ల నాకు ఈ యోగ్యతకల్గినది. మేము మొదట్లోగావించిన హిందూపునర్వివాహములలోనేమి, పిదపసాగిస్తున్న శారదానికేతనంలోనేమి- ఆమెయేప్రధానకర్త; నేను కేవలం ఆమెకార్యదర్శిని, లేకగుమస్తాను-అంతే. (కేసరిగారు: గుమాస్తాయేమి?

గురునాథుడవే!) అందుచేతనే శారదానికేతనంలో ఆమె శిలావిగ్రహము వేయ తలపెట్టిన పెద్దలు నావిగ్రహము కూడవేయుదుమనగా "వలదు-ఆమెయేదీనికి స్థాపకురాలు; నిర్వాహకురాలు" అనివారించితిని. ఆమెయొక్క శిలావిగ్రహమే ప్రతిష్ఠింపబడినది.

కావున ఈ కంకణస్వీకరణార్హత కూడా ఆమెదే. అయితే ఆమె బంగారుధరింపనని ప్రతిజ్ఞ చేసియున్నది. (కేసరిగారు: బంగారం పెట్టనని మీకు లేదుగదా) అందుచే శ్రీ కేసరిగారు దీని నిస్తామన్నప్పుడు వారన్నట్లు - శారదానికేతనమున దీనిని శాశ్వతముగాయుంతుమని చెప్పియున్నారు. అయితే ఆమె ఇంతలో జబ్బుపడి నన్ను పంపినది. నేను జాగ్రత్తగాతీసికొనివెళ్లి ఆమెకుదీని నప్పగింతును.

ఇంతకూ ఈ గౌరవము ప్రధానముగా ఆమె శారదానికేతనము నిర్వహించుచున్నదనికదా. ఆశారదానికేతనము, ఆమెయొక్కతెయే నిర్వహించుటలేదు. ముఖ్యముగా శ్రీ కేసరిగారు శారదానికేతనమును మొదటినుండియు ఆత్మీయముగానే భావించి ఆదరించుచున్నారు. మొదటినుండియు దానికి ధనసహాయం చేయుచునేయున్నారు. 10 సం॥ల క్రిందట నొకఅనాథబాలిక మా ఊరి శివాలయమునవిడువబడి - శారదానికేతనమువారు స్వీకరించి పోషింతురుగాకయని చీటీవ్రాసిపెట్టబడెను. ఆ బాలికను లక్ష్మీబాయమ్మగారు స్వీకరించిరి. ఆబాలిక పోషణార్థమై శ్రీ కేసరిగారు చాలసంవత్సరములు సాలుకు రు 100 ల చొప్పున నిచ్చిరి. వారిసహాయము మా శారదానికేతనమునకు ఎడతెగనిది. అందులో నీకంకణప్రదానము నొకభాగమే. కృతజ్ఞతాపూర్వకవందనములతో స్వీకరించి లక్ష్మీబాయమ్మగారికి దీనినిచేర్చెదను.

అంతట శ్రీమతి యామినీ పూర్ణతిలకమ్మగారు - సహాయనిరాకరణోద్యమము ప్రప్రథమదశలో తానున్నూ శ్రీ లక్ష్మీబాయమ్మగారున్నూ చేసిన బహుళప్రచారమును ప్రస్తావించిరి. స్త్రీ ఎప్పుడున్నూ, భారతీయసంస్కృతిలో ఆధిక్యతకలియున్నదని వివరించిరి. శ్రీ కేసరిగారు స్త్రీలయభివృద్ధికై చేయుచున్న సాయముల పేర్కొని - మొట్టమొదట తాను హిందూయువతీ శరణాలయము నారంభించినపుడు వీరు ఇంటి అద్దెను భరించినసంగతి ప్రశంసించి - కంకణరూపమునకానున్నను శ్రీ వారిఆదరణ మున్ముందుగా పొందిన భాగ్యము తనదేయని సగర్వముగా ప్రకటించిరి. రిక్తదశలోనుండి అయిశ్వర్యమువచ్చినపిదప చాలమంది చిన్నప్పటిసంగతులు మరచిపోతారు; కేసరిగారట్లుగాక - ఆనాడు అన్నముపెట్టిన అమృతహస్తములకు బంగారుతోడాలు తొడుగుట ప్రశంసార్హమని వక్కాణించిరి. స్త్రీ అభివృద్ధిచెందినగాని, దేశమునకు ప్రపంచమునకు లాభములేదనియు, స్త్రీలు అధికారమందున్నచో ఇన్నియుద్ధములుసాగవనియుచెప్పి, స్త్రీల అభివృద్ధికై శ్రీ కేసరిగారొనర్చుచున్నకృషిని ప్రస్తుతించి, సర్వవిధముల అభివృద్ధిగాంచుడని స్త్రీలను హెచ్చరించిరి.

పిదప మాజీపార్లమెంటరీ కార్యదర్శి శ్రీ బాపినీడుగారు మాట్లాడుచు - శ్రీ కేసరిగారి స్త్రీ జనోద్ధరణ కార్యక్రమమును ప్రశంసించిరి. లక్ష్మీబాయమ్మగారి కీకంకణము స్వీకరింపగల అర్హతలవివరించుచు వారు బి. ఏ. యం. ఏలు ప్యాసుచేయకున్నను, గాంధీమహాత్ముని దివ్యసందేశమును ఆంధ్రదేశమునంతటను ప్రచారముగావింపను, తాను ఆచరింపను, తగిన విద్యా, సంస్కృతికలవారనిపల్కిరి. చిరకాలమొక్కసంస్థను నడుపగల ఆచారము ఆంధ్రులలో చాలవరకు మృగ్యమైనను 25 సం॥లుగా ఎడతెగక శారదానికేతనము నడుపగల్గుట శ్రీ లక్ష్మీబాయమ్మ లక్ష్మీనారాయణగార్ల శక్తిసామర్థ్యములకు తార్కాణము అని నుడివిరి.

చిరకాలముగా ఆంధ్రదేశమునందు స్త్రీజనోద్ధరణసల్పిన, వీరేశలింగంపంతులు, సర్.వెంకటరత్నంనాయుడు, పిఠాపురం రాజా, రాయసం వెంకటశివుడు, రామాబాయమ్మగార్లను ప్రస్తావించి, శాశ్వతముగా నొక స్త్రీవిద్యాసంస్థనెలకొల్పిన భాగ్యము ఈ దంపతులదే అనినుడివిరి.

ఆతరువాత శ్రీమతి వసుంధరాదేవిగారు (ఆదిపూడి సోమనాధరావుగారిపుత్రి) లక్ష్మీబాయమ్మగారి కుటుంబమునకు తమతండ్రిగారి కుటుంబమునకుగల చిరకాలమైత్రి ప్రస్తావించి - చిన్నతనమునుండియు ఆదంపతులు తమయెడచూపుచుండిన వాత్సల్యమునుస్మరించి - వారిప్రజాసేవ, స్త్రీ జనోద్ధరణ కార్యక్రమము వివరించి అట్టి లక్ష్మీబాయమ్మగారికి సన్మానముజరుగుటకు తమహర్షమును వెల్లడించిరి. శ్రీ బాపినీడుగారు బి. ఏలు, ఎం.ఏలు ఎందుకన్నారు. ఆధునిక శాస్త్రజ్ఞానమువడసి, స్త్రీలున్నూ సంఘపునర్నిర్మాణమున సమానభాగస్వాములగుటకు ఈవిద్య అత్యవసరము - అని నొక్కివక్కాణించిరి.

అంతట శ్రీ కోట సోదరకవులలో నగ్రజులు తామువ్రాసిన పద్యరత్నములచదివిరి. ఆ పిదప శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారు రచించిన పద్యములను శ్రీమతి కంచిభొట్ల జానకీరాణిగారు శ్రావ్యముగచదివిరి. అటుతరువాత శ్రీ దేశిరాజు భారతీదేవిగారి పద్యాలను కోట సోదరులలో చిన్నవారు పఠించిరి. ఆవల కేసరి హైస్కూలు ఉపాధ్యాయులు - శ్రీ తిప్పావఝుల గౌరీనాధశర్మగారు తాము రచించిన పద్యములు చదివిరి. అన్నిపద్యములను వేరొకచో ప్రచురించియున్నాము.

తరువాత అధ్యక్షురాలు శ్రీమతి సరస్వతి చెన్నకేశవన్ గారు తమగంభీరభాషణముల నిట్లనిరి:—

ఈగౌరవము ఒక్క శ్రీమతి లక్ష్మీబాయమ్మగారికే, చేయబడినదికాదు, స్త్రీలకందరికి చేయబడినది.

నేడు కంకణముస్వీకరించిన శ్రీలక్ష్మీబాయమ్మగారు గావించినవానిలో అన్నియూ ప్రశంసింపబడినవిగాని ఒక్కవిషయమును ఎవరును విశేషించి చెప్పలేదు. ఆమె జీవితచరిత్రనుచూడగా—ఆమె 35 వితంతువివాహములు గావించినదని చెప్పబడినది. ఇది మహోత్కృష్టమైనపని. స్త్రీ పురుషులు సమానులే, కాని మనసంఘమున పురుషునకున్నహక్కులు స్త్రీకిలేవు. మానవులకు సహజమైనవాంఛలుకొన్ని ఉంటవి; వానిని తీర్చుకొనుటలో తప్పులేదు. ఎవ్వరోకొందరు విరాగులేవానిని విసర్జింపగలరు. అందరికది సాధ్యముకాదు. అదిసహజము. అయినను అట్టివానిని తీర్చుకొనుటకై పురుషుడు ఎన్నివివాహములైన చేసికొనును; భార్య బ్రతికియుండగనే తిర్గి పెండ్లాడును. భార్యయున్నను అన్యత్ర తనవాంఛల తీర్చుకొనుచుండును. కాని స్త్రీ—తన సహజవాంఛను తీర్చుకొనుటకై, పురుషుడుగతించినను తిరిగి ధర్మయుక్తముగ వివాహమాడరాదు. అతడు మంచిగాని, చెడ్డగాని, అవసరమైన అతనినివిడచి వేరుగా వివాహమాడరాదు. పురుషుడుమాత్రము తనభార్యనువిడిచి వేరువివాహమాడగలడు. స్త్రీ అతనికొక్కనికే కట్టుబడి కష్టమైనను, సుఖములేకున్నను ఏడ్వవలసినదే! న్యాయముగా నిట్లు పురుషు డనుభవించు స్వాతంత్ర్యము స్త్రీకి లేదు- కాననే ఆమె రహస్యముగా తప్పుదారులు త్రొక్కుచున్నది. ఈసంగతిని గ్రహించి శ్రీమతి లక్ష్మీబాయమ్మగారు- స్త్రీపునర్వివాహములు 35 గావించుట చాల ప్రశంసింపదగినది.

శ్రీ బాపినీడుగారు విద్య అక్కరలేదు; ఈ బి.ఏలు, ఎం,ఏలు ఎందుకన్నారు. లక్ష్మీబాయమ్మగారు విద్యావతిగాదనను. ఆమెనేర్చిన భారత భాగవతములున్నూ విద్యయే. ఆమెవానిని నేర్చినందున మాకన్న చాలగొప్పదని సమ్మతింతును. విద్యఅంటే-కేవలము చదువుకాదు. జ్ఞానము; అజ్ఞానము పుస్తకాలలోనే

లేదు. అజ్ఞానము విద్యాశాలల్లోను కళాశాలల్లోను నలుగురిలో కలిసి మెలిసి తిరిగి నేర్చుకోదగినది. అందువల్ల పదిమందితో కలిసి మెలసి జీవించే నేర్పు అలవడుతుంది. ఇంతవరకు ఇంటిలో బంధింపబడియున్న స్త్రీ సంఘనిర్మాణమున సమానభాగస్వామియగుటకు అట్టిజీవితముఅవసరము. విద్యావిధానమెట్టిదైనగావచ్చును. కావుననే శ్రీలక్ష్మీబాయమ్మగారు తనవలెనే ఇంటవిద్యనేర్చుకొననీ, అని బాలికలవిడువక,-శారదానికేతనము నెలకొల్పి-బాలికలనందుచేర్చి అన్నపానాదులుగడిపి విద్యగరపుచు సంయుక్తజీవనము నలవరచుచున్నారు.

ఆమె స్వాతంత్ర్యపోరాటమును సాగించినది అన్నారు. అందుకామె ధన్యురాలే; అయితే ఆమె పురుషులకు స్వాతంత్ర్యము సంపాదించిపెట్టినదిగాని స్త్రీలకు కాదు. అన్నిగౌరవస్థానములు; అన్నిఉద్యోగములు, అధికారములు పురుషులేఆక్రమించి స్త్రీలకు కళ్లనీళ్లుతుడుచుటకై ఏదొకటి రెండో ఇచ్చుచున్నారు. అట్లుగాదు. స్త్రీలకు సాంఘిక స్వాతంత్ర్యము, ఆర్థికస్వాతంత్ర్యము, రాజకీయ స్వాతంత్ర్యము రావలయును. స్త్రీపురుషులుగాపుట్టుట దైవకల్పన. అంతమాత్రమున ఆర్థికమైనహక్కులేల అంతరించవలయును? స్త్రీకి తండ్రి ఐశ్వర్యములో తప్పనిసరిగా భాగముఅవసరము.

నా కీఅవకాశమిచ్చినందులకు శ్రీ కేసరిగారికి వందనములు.

తరువాత అధ్యక్షులకు, సభాసదులకు, కంకణప్రదాతకు, గృహీతకు వందనము లర్పించుచు శ్రీ వెంకటప్పగారు-"వచ్చినది పురుషస్వాతంత్ర్యము"అన్నఅధ్యక్షురాలి వచనమునుదహరించి-"ఆ స్వాతంత్ర్య ఫలితముగా నేర్పడనున్న రాజ్యాంగచట్టపుచిత్తులో - స్త్రీపురుషులకు అది సమానభోగ్యమని చెప్పబడినది. ఉన్నవస్తువును ఉపయోగించుకొనే శక్తియుక్తులున్నూ స్త్రీలకు అలవడవలయును. అందుకుగాను పురుషులెంత దూరము స్త్రీలఅభివృద్ధికై కృషిచేసినను ఫలితము స్వల్పమే. అధ్యక్షురాలివంటి విద్యాధికురాండ్రే ఇక పైస్త్రీలనునడిపి ఆహక్కులననుభవించు శక్తిసంతులచేయవలయును. అప్పుడు ఇష్టమున్నను లేకున్నను పురుషులు ఎడతొలగక తప్పదు." అని నుడివిరి.

## సంగీత వినోదములు

అటుతర్వాత శ్రీ కేసరిగారి రెండవకుమార్తె చిరంజీవి వసంతకుమారి మృదంగ వాయులీనములు ప్రక్కవాద్యములుగా సుమారొకగంటకాలము సంగీతకచ్చేరినొనర్చి సభ్యులనానందాబ్ధి నోలలాడించినది.

25 సం॥ లుగా శారదానికేతమున సంగీతాది లలితకళలతో బాలికలకు విద్యగరపించుచు వారి కళాభ్యుదయమును గమనించుచుండిన శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారు ఆర్ద్రహృదయముతో ఈబాలికకు సంగీతకళాప్రపంచమున గొప్పభవిష్యత్తు కలదని ప్రశంసించినారు.

ఆపిదప చిరంజీవి గిడుగు చెల్లాయి వీణాగానముచే సభ్యులహర్షధ్వనుల చూరగొనినది. అభ్యాసావస్థయందుండియు ఈబాలిక వీణపైచూపిన నేర్పరితనమును పలువురుమెచ్చుకొనిరి.

తరువాత కేసరి హైస్కూలుబాలికలు కొంతసేపు సంగీతమునువినిపించి తెలుగువారి హైస్కూలునందు కళలకివ్వబడుచున్న ప్రాధాన్యతను ప్రకటించిరి. ఆవెంట మద్రాసు సంగీతకళాశాల(గోపాలపురము) విద్యార్థినులు-"సరిగపాగా ఇచ్చెరా-సాదాపా గాఇచ్చితి"-అనే సంగీతనాటికను ప్రదర్శించిరి. (ఈనాటిక వివరములు గతసంచికలో ప్రకటింపబడెను. గృ॥సం) శరభోజీమహారాజు గాయకశిఖామణుల పాత్రల ధరించినవారికింకను జంకుతీరకున్నను కళాభినివేశముగలవారని సభ్యులచే ప్రశంసింపబడిరి. కళాశాలాధ్యాపకులగు శ్రీ ద్వారకా పార్థసారధి, పార్థసారధిగార్లు వీరికిమరికొంత తర్ఫీదునొసంగుచో జంకుతీరి ఇట్టిసభల, యుత్సవముల ఇంకనుఆహ్లాదకరముగ ప్రదర్శనమొనర్ప గలుగుదురనుటకు సందేహములేదు అని ఎల్లరుతలంచిరి.

అంత మంగళముపాడగా సభయు, ఉత్సవమునుముగిసెను.

---

# శ్రీమతి వున్నవ లక్ష్మీబాయమ్మగారి జీవితచరిత్ర

## గృహలక్ష్మి స్వర్ణకంకణ బహూకరణము



గృహలక్ష్మి పత్రికవారు ఆంధ్రదేశములో అనేకవిధములుగ దేశసేవచేయుచున్న నారీమణుల కృషిని గుర్తించి స్వర్ణకంకణములచే సత్కరించుచున్నారు. ఇదివరకు వాఙ్మయసేవయు, మరియును ఇతర విధములగు సేవలును చేసినవారు, పలువురు సత్కరింపబడిరి. ఈ సంవత్సరము చిన్నతనమునుండి పలువిధములైన దేశసేవలలో పండి ఎండుచున్న వృద్ధురాలు శ్రీమతి వున్నవ లక్ష్మీబాయమ్మగారియొక్క దేశసేవను గుర్తించి బహూకరింపదలచుట ఎంతయు ప్రశంసనీయము.

వీరియొక్క జననకాలము నిర్ధారణముగ తెలియదు కాని ఇప్పుడు వారికి 66-వ సంవత్సరము జరుగుచున్నది. వీరిజన్మస్థలము గుంటూరుజిల్లా సత్తెనపల్లితాలూకా అమీనాబాదగ్రామము. వీరి తండ్రి కీ. శే. నడింపల్లి సీతారామయ్యగారు. తల్లిపేరు లక్ష్మీదేవమ్మగారు. వీరి తండ్రిగారు అమీనాబాద గ్రామమునకు కరణముగానున్న సంపన్నగృహస్థులు. వీరిమాతామహులు కొల్లిపాటివారు, వీరును సంపన్న గృహస్థులే. వీరికంటె పెద్దవారు యిరువురుసోదరులును సోదరియుగలరు. పెద్దసోదరుడు నడింపల్లి హనుమంతరావుగారు పశ్చిమగోదావరిజిల్లాలో తాసీల్దారుగపనిచేసి కీర్తిశేషులైరి. రెండవసోదరులు నరసింహంగారు రిజష్ట్రేషను యిలాకా వుద్యోగంచేసికీర్తిశేషులైరి. వీరిసోదరి రామాయమ్మగారు కృష్ణాజిల్లాలో తాశిల్దారీపనిచేసి కీర్తిశేషులైన మోదుగుమూడి వెంకటరత్నంపంతులుగారి భార్య, వీరు సజీవులైయున్నారు, మరియును సంపన్నులైన ఆరుగురు మేనత్తలను, పెదతండ్రియు పినతండ్రియుగల పెద్దకుటుంబమునకు చెందినవారు. లక్ష్మీబాయమ్మగారిని చిన్నతనముననే అనగా పదియవయేటనే అమీనాబాదకు శివారు గ్రామమైన వేములూరుపాడు కాపరస్తులు శ్రీవున్నవలక్ష్మీనారాయణగారి కిచ్చి వివాహముచేసిరి. వీరికి అర్జునరావుగారను నొకకుమారుడున్నారు. వీరును అసహాయోద్యమములో ఆంగ్లపాఠశాలనువిడిచి అడయారులోనూ, శాంతినికేతనములోనూ విద్యనభ్యసించి 1926 లో నొకసారియును 1930 లోనూ కారాగృహమునకు పోయివచ్చి ప్రస్తుతము విశాఖపట్టణములో ఓరియంటల్ యిన్సూర్యెన్సు ఆఫీసులో ఉద్యోగములోనున్నారు. వీరికి నాగేశ్వరరావు పంతులను 9 సంవత్సరముల వయసుగల కుమారుడుగలడు. వీరికోడలు వున్నవ వరలక్ష్మమ్మగారు శారదానికేతనములో విదుషీపట్టముపొంది సంగీతములో మిక్కిలి నిపుణులనిపించుకున్నారు. శ్రీ లక్ష్మీనారాయణగారు గుంటూరులో సెకండుగ్రేడు ప్లీడరుగా 1903 వ సంవత్సరమునుండి ప్రాక్టీసుచేయుచూ తరువాత 1913 వ సంవత్సరములో బ్రిటిషు ద్వీపములకుపోయి బారిష్టరు పరీక్షలో ఉత్తీర్ణులై మద్రాసు హైకోర్టులోను, గుంటూరులోను, ప్రాక్టీసుచేయుచూ, 1920 సంవత్సరమునుండి కాంగ్రెసు యొక్కయు, గాంధీమహాత్ముని యొక్కయు ఆ దేశముననుసరించి ప్రాక్టీసు విరమించుకొని సత్యాగ్రహోద్యమములో చేరిరి.

లక్ష్మీబాయమ్మగారు కాపురమునకు వచ్చునప్పటికే బాల్యములో పల్లెటూరిబడిలో చెన్నకేశవులుగారి వద్ద కొద్దిగాచదివి, కొయ్యపలకలకు పొక్కుతీసి, కంచెలనుండి దొండాకుతెచ్చి పసరుతో పానుగుబొగ్గురాచి కట్టించి వన్నెబెట్టి, ఆటవిడుపు పద్యములు నేర్చిరి. వానిలో నిప్పటికి కొన్నితప్పులతో జ్ఞాపకమున్నదీ క్రింది పద్యభాగము మాత్రమే.

"అలరు పసిండి కంకణము లందెలు మువ్వలు
రావిరేక పచ్చల పులిగోరు తాయతులు
జాళువపు నొస్సలతాడు మద్దికాయలు
గల నందనందనుడ నావాడవైయుండరా"

వీరు కాపురమునకువచ్చిన తర్వాత శ్రీలక్ష్మీనారాయణగారు స్త్రీ విద్యాభిమానులగుటచేత స్వవిద్యార్థి దశయందే స్వయముగ లక్ష్మీబాయమ్మగారికి భారతభాగవతాది, రామాయణ గ్రంథములను అర్థముచేసుకొనగల జ్ఞానము గలిగించిరి. శ్రీ లక్ష్మీనారాయణగారికి వలెనే వీరికిని భారతమున్న ప్రేమ. శ్రీలక్ష్మీనారాయణగారు విద్యార్థిదశలో హైస్కూలు తరగతులలోనుండగా మిక్కిలి సనాతనధర్మ పరాయణుడే అయినను శాస్త్రాల తరగతులలోనికి వచ్చినప్పటినుండియూ సంస్కరణాభిప్రాయములందే అభిమానము కలిగినది.

1902వ సం॥రములో లక్ష్మీనారాయణగారికి మొదట బ్రహ్మసమాజ, ఆర్యసమాజములతో సంబంధము గలిగి తన్మూలమున భావశైశాల్యముకలిగినను హిందూసంఘమునుండి విడివడిన ఈ ప్రత్యేకసమాజములతో ఐక్యమునుపొందుటకు ఇచ్ఛగింపక హిందూసంఘమున నిలిచియే అవసరమైన సాంఘిక, మత, సంస్కరణములను చేసుకొనవలెననితలంచి మతముపేరు మార్చుకొనుటకు ఇచ్ఛగింపక సనాతన వైదికుడనని చెప్పుకొనుటకే అభిలాష మెండుగనుండెను.

లక్ష్మీబాయమ్మగారునూ ఆ విధముగనే సాంఘికముగనూ, రాజకీయముగనూ ఎన్నిమార్పులను చెందినను సనాతనధర్మపక్షముననే నిలచివిప్లవాత్మకమైన పాశ్చాత్యభావములకు విముఖులైయున్నారు—

1902 వ సంవత్సరం అక్టోబరు 11 వ తారీఖునవున్నవ లక్ష్మీనారాయణగారు మిత్రులసహాయముతో గుంటూరులో ప్రథమవితంతు వివాహముజరిపిరి. ఈ వివాహము జరిగినప్పుడు లక్ష్మీబాయమ్మగారు గుంటూరులో లేకున్ననూ కొద్దినెలలలో వారునూవచ్చి లక్ష్మీనారాయణగారితోకలిసి గుంటూరులో వితంతుశరణాలయము నేర్పరచి అనేకవితంతు వివాహములగావించిరి. ఆ కాలమున హిందూసంఘము యీవివాహములకు సంపూర్ణముగ విముఖముగనుండి యీ వివాహములానర్చినందులకు సంఘబహిష్కారమును గావించి అనేకవిధముల యీ దంపతులను బాధపెట్టిరి. ఆ బహిష్కరణముయొక్క తీవ్రత క్రమముగ నశించినను ఇప్పటికి నీ పూర్తిగపోయినదనుటకు వీలులేదు.

1907 వ సంవత్సరము వరకును ఈ యిరువురునూ గుంటూరులో వితంతుశరణాలయము నడుపుచూ కీ॥ శే॥ శ్రీరావుబహద్దరు కందుకూరి వీరేశలింగముపంతుల వారికోర్కెపై రాజమహేంద్రవరముపోయి శ్రీపంతులుగారియొక్క వితంతు శరణాలయమునకు అధిపతులుగా పనిచేసి 1908 వ సంవత్సరములో అభిప్రాయభేదముగలిగి గుంటూరుతిరిగి రావలసినవారైరి. తిరిగివచ్చిన తరువాత తిరిగి శరణాలయమును స్థాపించి వితంతు వివాహముల జరుపుచునేవచ్చిరి. వీరి ఆధ్వర్యమున మొత్తము 35 వివాహములు జరిగినవి. ఇంతలో శ్రీ లక్ష్మీనారాయణగారికి సీమప్రయాణమువచ్చెను. ఒకవెలికి రెండువెలులైనవి. సాంఘికముగ ఎన్ని ఇబ్బందులువచ్చినను లక్ష్మీబాయమ్మగారు ఎన్నడునూ వెనుకంజవేయక ప్రతివుద్యమమునందునూ భర్తగారికి చేదోడువాదోడుగానుండిరి.

## రా జ కీ యో ద్య మ ము

1921 వ సంవత్సరములో గాంధిగారి అసహాయోద్యమము తీవ్రముగ ప్రారంభమైనది. పల్నాటి సీమలో అడవిపుల్లరి సత్యాగ్రహోద్యమములో శ్రీ లక్ష్మీనారాయణపంతులుగారు అరెస్టుగావింపబడి 25-7-1921 మొదలు 24-7-1922 వరకూ కారాగృహబద్ధులైరి. లక్ష్మీనారాయణగారు అరెస్టయిన తోడనే లక్ష్మీబాయమ్మగారు వారిస్థానము నాక్రమించి ఆంధ్రదేశమంతటనూ సత్యాగ్రహ ప్రచారము గావించిరి. శ్రీ లక్ష్మీబాయమ్మగారు గొప్పవక్త. ఆ రోజులలో వారియుపన్యాసములకు వేలకొలది జనులు మూగుచూ వారి యుపన్యాస ప్రేరితులై వందలకొలది విద్యార్థులు తమ కళాశాలలనువీడి సత్యాగ్రహోద్యమములోచేరిరి. ముఖ్యముగ విశాఖపట్నములోని వైద్యకళాశాలవిద్యార్థులను యీ విషయమున గణింప వలసియున్నది. 1922 వ సంవత్సర ప్రారంభములో ప్రభుత్వమువారి దమననీతి తీవ్రమై నాయకులందరూ కారాగృహబద్ధులై ఉద్యమము అణగియున్న కాలములో శ్రీమతి లక్ష్మీబాయమ్మగారునూ మరికొందరు సతీమణులునూ జాతీయపతాకము నిలుప గలిగి రనుట అందరకు తెలిసినవిషయమే.

రాజకీయోద్యమము తీవ్రత తగ్గినప్పుడు అందరునూ నిర్మాణకార్యక్రమమును తీవ్రముగ అవలంబించ వలసినదని గాంధిగారి ఆదేశమైయుండెను. ఆయాదేశానుసారముగ లక్ష్మీబాయమ్మగారు ఖద్దరు ప్రచారము విశేషముగ చేయుచున్ననూ మొదటినుండియు వారిహృదయమును ఆకర్షించిన స్త్రీ జనోద్ధరణమే తిరిగి చేపట్టి గాంధిగారి నిర్మాణకార్యక్రమములో నొకశాఖ అయిన జాతీయవిద్యావిధానము నవలంబించుటకై నిశ్చయించుకొనిరి. అదివరకు గుంటూరు అరండల్ పేటలో నొక బాలికాపాఠశాల లక్ష్మీనారాయణ దంపతులచే నడుపబడుచుండెడిది. అసహాయోద్యమములో ప్రవేశించిన తరువాత దానితో సంబంధము వదలుకొనుటచేత దివ్యజ్ఞాన సమాజమువారు దాని నిర్వహణమునకు పూనుకొనిరి. అయిననూ దానిని వారు గవర్నమెంటు పాఠశాలగాచేయుటకై యత్నించుచుండినందున దాని కంగీకరింపక దానిని తామే తీసుకొని జాతీయపద్ధతులపై నడుపుటకు నిశ్చయించుకొనిరి. మామూలు పాఠశాలవలెగాక జాతీయ విద్యావిధానము ననుసరించి గురుకుల పద్ధతులపై విద్యాలయము నడపనిర్ణయింపబడెను.

## శ్రీ శా ర దా ని కే త న ము

1922 వ సంవత్సరములో శ్రీ శారదానికేతనము గుంటూరులో స్థాపింపబడెను. కీ॥ శే॥ శ్రీ కాశీనాథుని నాగేశ్వరావుగారు ప్రారంభోత్సవముజరిపి మొదటి సంవత్సరమునకగు ఉపాధ్యాయుల జీతము నంతయు వారు భరించుకొనిరి.

## వి ద్యా వి ధా న ము

మాతృభాషయగు తెలుగులోనే అన్నివిద్యలునేర్పుతూ సంపూర్ణసాహిత్యజ్ఞానము కలిగించుట, తెలుగుకు మాతృభాష సంస్కృతమగుటచేతనూ హైందవవిజ్ఞానము సంస్కృతి అంతయూ దానియం దిమిడియుండుటచేతను హిందువులలో సంస్కృతజ్ఞానము అవసరముగా భావింపబడి శారదానికేతన విద్యా విధానములో చేర్చబడెను. ఈ రెండుభాషలునూ యెనిమిదిసంవత్సరములుచదివి ఉత్తీర్ణులైన వారికి విదుషీ

పట్టమీయబడును. సర్కారుపరీక్షలతో దీనికిసంబంధములేదు. స్త్రీవిద్యావిధానములో కళాజ్ఞానమునకు ప్రధానస్థాన మివ్వవలెనని భావించి, సంగీతము చిత్రలేఖనము విద్యావిధానములో చేర్చబడెను. కాంగ్రెసు ఆదేశానుసారము హిందీయావద్భారతభాషగా బోధించుటకును, కోరినవారికి దానికిబదులుగా ఇంగ్లీషు బోధించుటకున్నూ, ఏర్పాటుచేయబడెను. ఇంతవరకూ విధానమంతయు విజ్ఞానమునకే సంబంధించినందున ప్రధానముగా భుక్తికి తోడ్పడగల గృహపరిశ్రమలుగూడా విధానములోచేర్చుట అవసరముగభావింపబడి, నూలువడుకుట, ఏకులు చేయుట, కట్టు, చంకీ, నవారు, పేము, మొదలైనవి నేర్పుటకు ఏర్పాటుచేయబడెను. యివిగాక లోకవిజ్ఞానమలవడుటకై చరిత్ర, భూగోళము, గృహవైద్యము, ఆరోగ్యశాస్త్రము విధానములో చేర్చబడెను.

మతము, నీతివిషయికమైన గ్రంధములుకూడ బోధింపబడుచున్నవి.

పైవిధానము ననుసరించి విద్యగరపుటకు నిశ్చయించబడినది. గవర్నమెంటువారి పరీక్షలతోగాని పర్యవేక్షణముతోగాని సంబంధములేదు. ఈ విద్యాలయముయొక్క ప్రధాననిర్వాహకులును, ఉపాధ్యాయులును, విద్యార్థులునూకూడా ఆసహాయోద్యమముతో సంబంధము కలిగియుండుటచేతనూ అందుపలువురు కారాగృహములకేగివచ్చిన వారగుటచేతనూ ప్రభుత్వమువారు మొదటినుండియూ నిరోధించుచునేయుండిరి. శారదానికేతనము జస్టిస్‌పక్షమువారికి వ్యతిరేకులైన కాంగ్రెసుపక్షమువారిచే నడుపబడుచుండినను జాతి మతభేదములను పాటింపక అన్నివర్ణములవారికిని విజ్ఞానదానమే ప్రధానఆదర్శమగుటచేత ప్రభుత్వమువారి అభిప్రాయ మెటులున్నను జస్టిస్‌పార్టీనాయకులు వ్యక్తులుగా మొదటినుండి అభిమానము చూపుచూ సహాయముచేయుచునేయుండిరి. దీనినిబట్టి శారదానికేతనము ఆంధ్రదేశములోఅన్నిశాఖలవారిచే అభిమానింపబడుచుండెనని చెప్పవచ్చును. మంత్రి రామారాయణింగారు స్థానికసంఘములు విరాళములిచ్చుటకు అనుమతించిరి.

చాలాకాలమువరకు సర్కారుపరీక్షలకు పంపకనే విద్యాలయమువారే తరగతులన్నింటికిని వార్షిక పరీక్షలుజరిపి పట్టములనిచ్చుచుండిరి. ఆంధ్రదేశముయొక్క వివిధభాగములనుండియు, దక్షిణాఫ్రికా, రంగూను, ఖరగ్‌పూరు, హైదరాబాదుల నుండియూ తెలుగువిద్యార్థినులువచ్చి గురుకులవాసముచేసి చదువుకొనుచుండిరి. బాలికలిచ్చట చదివిన చదువును బట్టియును, యిక్కడ అలవడిన జీవితాదర్శముల బట్టియునూ జనులలో వారికొక విశిష్టత యేర్పడినది. 1937 వ సంllరంలో కాంగ్రెసువారు మంత్రిపదవులను స్వీకరించిన తరువాత శారదానికేతనము యొక్క సంస్కృతాంధ్రశాఖ, ఆంధ్రవిశ్వవిద్యాలయమువారిచే ప్రాచ్యభాషా కళాశాలగా అంగీకరించ బడినది. పారిశ్రామికశాఖను ప్రత్యేకపాఠశాలగా గవర్నమెంటువారంగీకరించిరి. అప్పటినుండియూ పలువురువిద్యార్థినులు విశ్వవిద్యాలయ పరీక్షలలోను, వృత్తిపరీక్షలలోను ఉత్తీర్ణులై, ఆంధ్రదేశములోను, నైజాములోను, ఉన్నతబాలికాపాఠశాలలలో పండితస్థానముల నధిష్ఠించియున్నారు. శారదానికేతనముయొక్క విజయము కేవల మీపట్టభద్రులలోలేదు. ఈ విద్యాలయ శిక్షణమును గ్రహించిన పలువురు విద్యార్థినులు, ఆంధ్రదేశములోని సాంఘిక, రాజకీయోద్యమములలో ప్రధానస్థానము వహించియున్నారు. సంఘము లక్ష్మీబాయమ్మ అనునామె హైదరాబాదువాస్తవ్యురాలు చిత్రలేఖనమున మిక్కిలి నైపుణ్యము గడించినది. హైదరాబాద్ పట్టణములో నెలకు నూటయిరువది రూప్యములపై చిత్రలేఖ

నోపాధ్యాయునిగానుండి పలువిధముల సాంఘికసేవచేయుచూ, నైజాములో రాజకీయోద్యమము ప్రారంభమగుట చోడనే తనఉద్యోగమును తన్నివైచి, నాయకత్వము వహించియున్నది. భీమిరెడ్డి అన్నపూర్ణాదేవి, సంస్కృతాంధ్రములలోను, సంగీతములోను మిక్కిలి నిపుణురాలు. ఈమె మైసూరురాజ్యములో రాజకీయోద్యమమున భర్తకు సహధర్మచారిణియై స్త్రీజనులకు నాయకత్వము వహించి నడుపుచున్నది. స్థాలీపులాకన్యాయముగ రెండుపేర్లుతెలిపితినిగాని శారదానికేతనము విద్యార్థినులలో పలువురు యథాశక్తిని వివిధోద్యమములలో పాలుగొనుచున్నారు. పాఠశాలలలో సమర్థులైన ఉపాధ్యాయినులనిపించుకొనుచున్నారు. పలువు రాదర్శప్రాయులుగ గృహనిర్వాహణము గావించుకొనుచున్నారు. మరికొందరు ఉద్యోగములను స్వీకరించి సోదరీసోదరులను పోషించుకొనుచున్నారు. దీనినిబట్టి శారదానికేతనముయొక్క సేవ ఆంధ్రదేశములో వ్యర్థముకాలేదని స్పష్టపడగలదు.

శ్రీమతి లక్ష్మీబాయమ్మగారు అహోరాత్రములు శారదానికేతనములోనే సేవచేయుచున్నను, గాంధీగారి పిలుపువచ్చినప్పుడెల్లను కారాగృహమునకు వెళ్లుచునేయుండిరి. 1930 వ సంవత్సరములో 1932 వ సంవత్సరములో 1940 వ సంవత్సరములోను మూడుపర్యాయములు కారాగృహవాసము చేసివచ్చిరి. లక్ష్మీబాయమ్మగారు మొదటినుండియు అప్రియమైనను యదార్థముచెప్పు నలవాటుగలవారు. తన వశముననున్న బాలికలను, పిన్నలనుగూడా శిక్షణమునకలవర్చి అదుపులోనుంచే శక్తిగలవారు. అందుచేతనే మొదట వితంతుశరణాలయమును, తరువాత శారదానికేతనమును, ఏ చెడ్డపేరునులేక జయప్రదముగ నిర్వహింపబడినవి.

ఇప్పటికి సుమారు మూడుసంవత్సములనుండి వారికి ఆరోగ్యముచెడినది. అయిననూ శక్తికిమించి కూడ సేవచేయుచునేయున్నారు.

శారదానికేతనము ప్రారంభమై 25 సంవత్సరములు నిండినవి. రజితోత్సవము జరుపవలెనని ఆంధ్రదేశములోని పలువురుప్రముఖులు సభ్యులుగాగల ఒకసంఘమేర్పడినది. దేశములో మహాజనులయొక్క ఆదరాభిమానముల బొందిననూ, వెనుకటికంటె కాంగ్రెసుప్రభుత్వమువల్ల యెక్కువ సహాయముకలుగలేదు. 25 సంవత్సరములనుండియు ప్రభుత్వముయొక్క నిగ్రహానుగ్రహములకు పాత్రమగుచూ, ఎన్నియో చెవగండములుగడచి నిలచియున్ననూ, యింకనూ శాశ్వతముగ నిలుచుటకు స్థిరమగు ఆర్థికసంపత్తు లేర్పడలేదు. శారదానికేతనము యిదివరకుచేసిన సేవను గుర్తించి పలువురు ప్రముఖులు రజితోత్సవసందర్భమున ఒక లక్షరూప్యములను వసూలుచేసి శాశ్వతనిధిని ఏర్పరచవలెనని సంకల్పించియున్నారు. దేశీయులెల్లరును ఆ సంకల్పము నెరవేరుటకు తోడ్పడుదురుగాక.



# సువర్ణకంకణ బహూకరణాభివందన

# పద్యరత్నములు

కవిచంద్రులు, కోట సోదరకవులు, అష్టావధానులు.



శ్రీ యోషామణి మందహాసమున వీక్షింపంగ వెన్వెంట నెం
తే యుత్సాహము కందళింపఁ గరుణార్ద్రీభూతచేతస్కుఁడై
స్ఫాయత్ప్రేమను జూచుమాధవుఁడు, విస్తారంబుగా సంపదల్,
శ్రేయంబుల్ పొనరించి, ప్రోచెడిని, లక్ష్మిబాయి ధీమన్మణిన్.

స్వార్థంబు త్యజియించి పరహితార్థముసేయఁ గారాగృహాల శిక్షను భరించి,
నలుఁబదికోట్ల జనంబుల తల్లి పాదాలు భజింప ముందంజవేసి,
జగతిలోఁ గాంచిన జన్మసాఫల్యంబు సిద్ధించుకొనఁగఁ బైచేయిచూపి,
దరిత్రోవఁ గానని నిరుపేదవారిపై కరుణారసంపు తుంపురులు నింపి,
జగతి కాదర్శ మయ్యెడు సరణి, శారదానికేతన స్థాపన ధర్మరతికిఁ
బ్రథమ తాంబూల మందెడు భాగ్యశాలివమ్మ! ఎవరీడు? లక్ష్మిబాయమ్మ! మీకు?

ఎపుడో తాల్చితివమ్మ కంకణము నారీలోక వృద్ధ్యర్థమై
యిపుడా కంకణమిందు స్వర్ణమయి, యెంతేకాంతి భాసిల్లె, నాం
ధ్ర పురంధ్రీమణు లుల్లసిల్లఁగ, శుభారంభంబుగాఁదోఁచె, నె
య్యపు కార్యాచరణ ప్రవీణులయి ధన్యత్వంబునం బొంగరే!

ధరణీభాగమునందు వర్ధిలెడు నాంధ్రస్త్రీల మేల్బంతివై
వరలంజాలిన కారణంబునగదా! భావించి, యీనాడు కే
సరి, చేఁజేత బహూకరించుటలు, శశ్వత్కీర్తి సంధిల్ల, మీ
సరి యేరీ మహిళాసమాజమున విశ్వప్రేమ విప్పారఁగన్,

అనవద్యప్రతిభా ప్రయత్నములు వియ్యాలాడ నానాట జే
సిన సత్కార్యకలాపమై తగినదా స్త్రీవిద్య సంఘాభివృ
ద్ధిని గావించు, త్వదీయదీక్ష కతిభక్తిన్ గూర్చు పద్యాభినం
దన రత్నాభరణంబు కంఠమున జేత ప్రీతిఁగ్గైసేయుమా!

# సువర్ణకంకణ బహూకరణాభివందన
# పద్యరత్నములు

శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారు



కవితా లతాప్రౌఢి గల్పించె నెవ్వాణి తనవిహారపుసీమ యనుచు దిరిగె
భారత భాగవతారహస్యంబులన్ బ్రకటించె నెవ్వాణి పండితులకు
నవరసశృంగార నటనాధురీణతన్ కల్పించె నెవ్వాణి కల్పకముగ
సంగీతసాహిత్య సకలకళానంద మేమాత పూరించె నెలమితోడ

అట్టి గీర్వాణి కలవాణి యమలవాణి ఆంధ్రమహిళామణీలోక మమరియున్న
కంకణోత్సవసమయాన గారవమున చెలగుగావుత, మంగళాశీస్సులొసగ.

నానార్థకల్పిత నవ్యభావప్రౌఢి ప్రజల రంజింపగా వరలుమమ్మ;
విద్యావతుల కిల వెలలేని సుజ్ఞాన దాయకంబై భువి దనరుమమ్మ;
నవగుణాలంకార కవనాధురీణతన్ భావ్యమై దీవనల్ బడయుమమ్మ;
గద్యపద్యోచిత ఘనహాస్యరసయుక్తి అసమానచాతురి నెసగుమమ్మ;

సరస సాహిత్యమాధుర్య సారమనగ భువిజనానందదాయక పుష్పమనగ
స్త్రీల విద్యాప్రపూర్ణవై స్థిరముగాను వరలు మాయమ్మ గృహలక్ష్మి ధరణిలోన.

సిరిసంపదలకు నాశీర్వాదమందునా కేసరియండ నీకే ఫలించె;
అభివృద్ధిగాంచ నిన్నాశీర్వదింతునా రమణి మాధవి రామరక్ష నీకు;
అఖిలవిద్యలకు నిన్నాశీర్వదింతునా చెలియమై శారద చెంతనిల్చె;
సౌభాగ్యములకునిన్ సరవిదీవింతునా లక్ష్ములకును గృహలక్ష్మి వీవు;
కలుములొలికించు జవరాలి గన్నబిడ్డ కేసరికి ముద్దుబిడ్డవై వాసిగనుట
నొనర నేటేట జన్మదినోత్సవముల జరుపుకొనుమిల్లె ధరలోన శాశ్వతముగ.

ఇరువది నొక్కయేడు యిపు డిప్పుడె దాకె ముదంబు నొందగా
వరకవితాపరిసంగ వరవర్ణినివై జెలువొందినా వనన్
మురిపెము లెన్నొ గాంచి మునుముందు మహోన్నత జ్ఞానరత్నమై
వరలుదువమ్మ భామినుల భావి సుభాగ్యము లందజేయగన్.

సరసకవిత్వ తత్వరస సారమెరింగిన భారతీమణుల్
గరముల దిప్పుచుండి తమ గాదిలి పల్కుల గుమ్మరింపగ౯
ధర నవ యవ్వనాంగి వయి తావకకీర్తిని పెంపుసేయుచున్
దరుణుల పాలవెల్లి వన ధర్మసుమంబులు జల్లుమెయ్యెడన్.

మహిళాలోకము నుద్ధరింపగను సన్మానంబులన్ సేయగా
మహిలోనన్ జననంబునొందితివి సన్మాన్యంపు సత్కీర్తులన్
రహిమించన్ గణియించినా విలను సద్గ్రంథాను రూపమ్మునన్
గృహలక్ష్మి చిరకీర్తి వర్ధిలుము నారీలోక సంధాత్రివై.

పలుకుం దొయ్యలిచేతి రాచిలుకవై ప్రజ్ఞావిశేషంబున౯
లలితంబై నవభావ సంకలితమై రాణింపుచున్ నీతి పెం
పొలయన్ సత్కళ లభ్యసింపగను నుద్బోధించి వర్ధిల్లుమా
కలకాలంబు ధరాతలంబునను సత్కళ్యాణముల్ గాంచగన్.

కేసరి ముద్దుబిడ్డ వయి కీర్తిగణించిన దానవౌట నీ
కేసరి నీవు సంతతము గీములవర్ధిలి సత్ప్రచారముల్
జేసినదానవౌట నిల శ్రీకరలీలల నుల్లసిల్లుచున్
భాసిలు దీవనన్ బడయు భాగ్యమునీదె ధరాతలంబునన్.

కవితామతల్లుల గౌరవోన్నతి నిల్ప కరకంకణాల్ దొడుగు ఘనతనీదె;
భాషావధూటిని భూషలన్ బోషించు విదుషీమణుల బిల్చు ముదమునీదె;

మాతృభాషన్ సతము మన్నించు నిల్లాండ్రి రహిఁ గౌరవించు నా మహిమనీదె;
విజ్ఞాన విస్ఫూర్తి వెలయు నిల్లాండ్రకు సన్మానమొసగు నా సరణినీదె;

లలితకళలందు దేల్ గృహలక్ష్మి వౌట నీయశంబును నీజ్ఞాన నిరతి జగతి
క్రమకాంతుల నిన్ను సత్కవులు మెచ్చ ప్రబలగలవమ్మ భావి సౌభాగ్యగరిమ.

కవయిత్రుల్ నవగాయకామణులు నుత్కంఠాన బాడంగ స
త్కవులెల్లన్ శుభదాశిశుల్ పలుకగా కైమోడ్పులన్ జేసి వై
భవసౌభాగ్యములందు మా అదియె నీ ప్రాబల్యమున్ గూర్చు ని
బ్భువి నీపుణ్యఫలంబుగా దనరుచున్ బొల్పారు ధీశక్తులన్.

శారదా సదనంబు స్థాపించి దీక్షతో నడపజాలినయట్టి పడతివీవె;
సంఘసేవాదీక్ష సాధింపగలయట్టి సాధ్వీమణివటన్న జగతినీవె;
భాషాప్రవీణతన్ ప్రబలజేయగజాలు విదుషీమణివటన్న ముదితనీవె;
మహిళామణుల తలమానికంబను ఖ్యాతిగాంచి పేర్మించిన ఘనతనీదె

బుధులునిన్ మేలుమేలని బొగడగాను ఆంధ్రభాషావధూటి నీయంకపీఠి
నధివసించెను; గొల్చు భాగ్యమ్మునీది; ఘనత నపరంజి రత్న కంకణముగొనుము.

ఉన్నవ లక్ష్మిబాయి! సుగుణోన్నతిగన్న శుభప్రదాంబ! ఓ
యన్నులమిన్న! నీకృషికి నౌదల దాల్పగవచ్చు; నీదు పే
రన్న ముదంబుగల్గదొకొ ఆంధ్రవధూటికి చేరుచుక్కవై
మన్నన లందుమమ్మ బుధమాన్యులు మెచ్చగ నెల్లవేళలన్

● ● ●

లక్ష్మీకటాక్షవీక్షా పక్ష్మలసుధలూరుచుండ, పరమప్రీతిన్
లక్ష్మీనారాయణులీ లక్ష్మీనారాయణులను నిలాస్థలినోమున్

నలువమోమునసదా చెలువారతోచు సద్విద్యాధినేతవాగ్దేవిభంగి
అర్ధదేహంబుదానై ప్రేమనించెడు భవ్యచారిత్ర పార్వతితెఱంగు
మధుదైత్యమర్దను హృదయాధివాసయై లాలిత్యమెసగెడు లక్ష్మికరణి
భాస్కరువెనువెంట వదలక రహిమించు ఛాయాసతీ వతంసంబుచాయ

లక్ష్మీనారాయణార్యు నుల్లమున నిల్పి సకలజన హిత కార్యంబు సలుపునట్టి
భవ్యచారిత్రి మాలక్ష్మిబాయిబోలు కాంతలెందైన గల్గిరే కలయజూడ.

సంఘసంస్కార దుస్తరకార్యము వహించి సడరాని కష్టముల్పడుట యొకటి
పతితోడు నీడరై బంధువర్గము వీడి గ్లానిబొందక యుండగలుగుటొకటి
స్వాతంత్ర్యదీక్షతో సమరవీరులభంగి సంతయు చెఱసాలకేగుటొకటి
ఘనశారదానికేతనము సుస్థాపించి నెలతలకును విద్య నేర్పుటొకటి
చాటవే నీదు మాతృదేశంబుకొఱకు పాటుపడినట్టి కార్యముల్ బ్రజలకెల్ల
అరసిచూడంగ నీవు త్యాగావతార ముట్టిపడ్డట్టు తోచు నీయుర్విమీద.

పారావారగభీర మానసమునన్ సల్మారుదేశార్థమై
కారాగారనివాసమోర్చి సతమున్ కష్టంబులెన్నియున్
ధీరస్థైర్యతగల్చి దేశహితమున్ ధీశాలివై గూర్చియా
పారాసారవిచార శేముషినిదానశ్రాంత మొప్పారగన్.

మునుగడపంచవింశతి సమల్ వనితా జనవృద్ధిగోరి నె
మ్మనమున భక్తిశ్రద్ధల సమంచితవైఖరి శారదానికే
తనమురహింపజేయుచు సదాయదియేపనిగా జరిపించు నీ
ఘనుల చరిత్రమెల్లరకు గౌరవపాత్రము గాధరిత్రిపై.

ధృతిగొని కార్యభారమున దేహరుజన్ సహియించి మానినీ
హితమె మదిన్ సదా దలచి, యెంతలువచ్చిన కష్టమోర్చి సం
తతకృషి సేయుదీక్షగొని, తాలిమినోరిమి లక్ష్మిబాయి యు
న్నతదశగూర్చె శారదకనారత వృద్ధిరహింపనేటికిన్.

కూరిమితోడ మీకిపుడు గూర్చెడు గౌరవవార్త విన్నచో
సారెకుమానసాంబునిధి సంతసవీచికలూగసాగ, నీ
ధారుణియాంధ్రమానినుల, ధన్యతబొందితి, మాన్యమైన
గౌరవకీర్తులెల్ల కలకాలమునిల్చుత నుర్విపైనికన్.

ఆంధ్రవనితల తలమానికాఖ్యనలరి యాంధ్రకీర్తిని పెంపొంద నవయమీవు
సేవజేసితి స్త్రీవిద్య చేవమీర యెన్న నావె నాబోంట్లకు నిన్నుగూర్చి.

ఏతత్సుగుణోపేతకు నాతతదీర్ఘాయువొసగి, యారోగ్యంబున్
శ్రీతరుణీదయితుడు విఖ్యాతంబుగనిచ్చుగాక, ననవరతంబున్.

దేశిరాజు భారతీదేవి.

## సువర్ణకంకణ బహూకరణాభివందన పద్యరత్నములు

శ్రీమతి, మాతృదేశహిత సేవ ననారతబద్ధదీక్ష, శ్రో
త్రామృత వాగ్ఝరీ ప్రముదితాంధ్ర జనాదర భాజనంబు, ని
త్యామల సత్ప్రబోధ సముపార్జితకీర్తివి, లక్ష్మిబాయి! మా
కోమలహేమ కంకణముఁ గోర్కెతో నిత్తుము స్వాగతంబిదే.

ఉన్నవవంశంబు నున్నతకీర్తిమై వెలుఁగొంద మెట్టినవెలఁది నీవు,
నడిమిపల్లెకులము నందడఁగి వెలువడిన సుగుణరాశివి, యాంధ్రసుకృతి నీవు,
సత్యాగ్రహాదులఁ బత్యాశయములతో జతఁగూడి నెఱపిన సతివినీవు,
చింతాప్రబాధిత వితంతూద్వాహాదుల మగనికిఁ జేదోడు మగువ నీవు,

దేవసౌభాగ్య కారకదేవతలని బాలికా జ్ఞానభిక్షకు మేలిశార
దానికేతన మిడితీవు, తగుదువమ్మ సర్వవిధముల గృహలక్ష్మి సత్కృతులకు.

పతులఁగోల్పోయి యనదలౌ సతులఁజూచి సంఘబాధలకోర్చి సంస్కరణ పరత
రావు బహదూరు వీరేశు రాజపథము మెట్టి దయఁజూపు పతితోడ మెలగిన సతి.

మతకుల భేదముల్ విడచి మానితరీతిని విద్యనేర్పి, స
న్మతులనుజేసి, దేశహిత మాదరమొప్పఁగఁ జేయదిద్ది, భా
రత యువతీమణుల్ దిశలరంజిలఁ జల్లెడినీవు నాంధ్రభూ
సతత తపఃఫలంబగుదు, సత్యము, నీకుఁ జిరాయువయ్యెడిన్.

జాతీయముగ నీదు శారదానికేతనంబు మెలఁగిన పాటవంబు చెడునే,
సంఘము లక్ష్మమ్మ సచ్చరిత్రకారిణి, యన్నపూర్ణయు గాన సన్నుతాళి,
ఇంకను నెందఱో; యెఱిగికాదే యాంధ్ర విశ్వవిద్యాలయ వినుతిఁగనియె,
తెల్లదొరతనాన తెలివిడిలేదుపో, సత్యాగ్రహ గ్రహాసక్తమగుచు,

నిపుడు కాంగ్రెసు దొరతన, మిందు ప్రముఖు లేలకో దీని యుద్ధార మాలసింప;
మాదు గృహలక్ష్మి స్త్రీసేవ ముదమునంది హెచ్చరించుచుఁ గంకణ మిచ్చుగాత.

తిప్పావఝుల గౌరీనాథశాస్త్రి.



# నా చిన్ననాటి ముచ్చట్లు

కే. యన్. కేసరి

## మరుపురాని మన మహాత్ముడు



సుమారు 30 సంవత్సరములనాడు మన మహాత్ముడు విజయవాడలో పూరించిన పాంచజన్యము, నేను మొదటివిన్నది. అప్పటినుండి నాలోకల్గిన మార్పులను క్లుప్తముగ యిక్కడ వ్రాయుచున్నాను. అంతకుముందు నేనుండిన స్థితినికూడ ముందుగ తెలుపుచున్నాను.

నాకప్పుడు నడిపయసు. గుంటూరుజిల్లా నా జన్మభూమి అగుటచేత తిండికి ఘనుడుగ నుండెడివాడను. అప్పుడు నాచేత డబ్బుమెండుగ మెదలుచుండెను. నగరనివాస మగుటచేత కోరికలకును హద్దులేకుండెను. తెల్లవారగనే చిక్కనికాఫితోకూడ రెండు రకముల ఫలహారములను, మధ్యాహ్నమున మంచిభోజనమును, పిమ్మట మూడుగంటలకు ఒకకారము, ఒకతీపి, కాఫి పుచ్చుకొనుచుంటిని. సాయంసమయమున షికారుకువెళ్లి సుగుణవిలాస సభలోను, మద్రాసు యునైటెడు క్లబ్బులోను స్నేహితులతోకూడ యిష్టాగోష్టిసలుపుచు అక్కడి అల్పాహారములను ఆరగించుచుంటిని. షికారుకుపోయి యింటికివచ్చునప్పుడు దోవలో బొంబాయి మిఠాయీలను, గుజరాతి లడ్డులను, మార్వాడి గరిమసాలపకోడీలను తెచ్చుకొని తినుచుంటిని. ఇవిఅన్నియుజాలక ఇంటిలో నేతితో గారెలను చేయించుకొనుచుంటిని. ప్రతిశుక్రవారము ఇంటిలో అమ్మణ్ణికి మధుర పదార్థములు నివేదన జరుగుచుండెను. పరిమళవక్కపొడికి పన్నాయిల్లు పేరుగాంచియుండెను. తిరువళ్లూరు, కుంభకోణముల చిగురుతమలపాకులను వాడుచుంటిని. బొజ్జకు శ్రీగంధమును పూయుచుంటిని. తిలకము రకరకముగ దిద్దుచుంటిని.



"గాంధియుగమున నేను."

మద్రాసులో నాకు వైశ్యులతో సహవాస మెక్కువగుటచేత నావేషము పటాటోపముగనుండెను. ఆ కాలమున వెడల్పాటి సరిగదుప్పటాలకు ప్రాముఖ్యతకలిగి యుండెను. ఆరణిచాకులెట్టు బొద్దంచు అంగవస్త్రములను ధరించుట ఆకాలమున నాజూకు. వెడల్పాటి బెంగుళూరు సరిగతలపాగాలకు పెద్దపేరులేకపోయినను, నెల్లూరు వెంకటగిరి సన్నసరిగ తలగుడ్డలకు మాత్రము మంచిపేరుండెను. మంచిచలవచేయుటకు ఆరణి సుప్రసిద్ధము. ఆరణిపంచలను వెంకటగిరి తలగుడ్డలను ఆరణి చాకలివానికివేసి వాడుకొనుచుంటిని. మేలైన మల్లు వస్త్రములును వెలగల పట్టుచొక్కాయీలును కేంబ్రిక్ తెల్లషర్టులును విరివిగవాడుకలోనుండెను. అంగవస్త్రములకు ఆరణి చాకలి షర్టులను చొక్కాయిలను యిస్త్రీపెట్టుటకు మద్రాసుచాకలి యుండెను. రెండుబీరువుల నిండుగ ఈవుడుపు లుండెడివి. సాక్సు బూట్సు వాడుకలో యుండెను. పలుమారు దుస్తులను మార్చుచుంటిని.

నాచెవులకు ఒంటిరాయి వజ్రముల అంటుజోడుండెను చిటికినవ్రేలికి 5 కారట్ల వజ్రపు వుంగరముండెను. జేబులో పెద్దబంగారపు గడియారము; పొడుగాటిగొలుసు; దానికి మెడల్సు వ్రేలాడుచుండెను. షికారుకుపోవునపుడు చేతులో వెండిపొన్ను వేసిన మొరాక పేముండెడిది. మొలకు విజయనగరపు బంగారు మొలత్రాడుండెను. ఇంక నెన్నియో పటాటోపములుండెను.

గాంధీమహాత్ముని ఉపదేశగీతములను వినిన వెంటనే క్రమముగనాలో అనేక మార్పులుకలిగెను. నావేషముమారినది. తలబోడిచేసి సరిగ తలగుడ్డకు బదులు గాంధి టోపిని ధరించితిని. సరిగవస్త్రములు పట్టుచొక్కాలు దుకూలాంబరములు దూరము లయినవి. సాత్వికాహారములను మితముగ భుజించుటకు అలవడితిని. ఆకలిలేనిది ఆహారములను తీసుకొనుట మానితిని. కాఫిని కొంతకాలమువరకు మానగలిగితిని. మేక పాలను కొన్నిదినములు రుచిచూచితిని. వేరుశనగలు వికటించువరకు తింటిని. రాటమును త్రిప్పుటకు ప్రారంభించితిని. సాధ్యమైనంతవరకు ఖద్దరు వస్త్రములనే కట్టుచుంటిని. ఇంట బైట ఖద్దరుజుబ్బాతోనే కాలముగడుపుచుంటిని. అంటుజోడు ఉంగరములను అమ్మి వేసితిని. గడియారము గొలుసును కరగించితిని. తాంబూలమును మానితిని. పరదేశ వస్తువులమీది భ్రాంతివిడిచితిని. బాధించుచుండు క్రిమికీటకాదులను హింసించునప్పుడు కూడ మహాత్ముడు మనసునకు వచ్చుచుండును. దినచర్యలలో పలుమారు మహాత్ముడు జ్ఞాపకమునకు వచ్చుచుండును. వీరిని మనము యెట్లు మరువ గలము?

# పుష్పక విమానము

పుణ్యపురుషుల నిర్యాణానంతరమున స్వర్గమునుండి పుష్పకవిమానము భూలోకమునకువచ్చి పుణ్యాత్ములను కైవల్యమునకు తీసుకొని పోవునని పురాణగాథలను వినుచుంటిమి. గాని ఈ 12-2-48 దివసమున మద్రాసునందు ప్రత్యక్షముగా చూడగల్గితిమి.

మద్రాసు సముద్రతీరమునకు మహాత్ముని అస్థుల పుష్పకవిమానము వచ్చినప్పుడు ఆ దృశ్యము చూచుభాగ్యము ఈ పురజనులకు లభించుట వారు చేసిన పుణ్యఫలము. ఈ విమానమునకు ముందు గవర్నరు, వారిసతీమణి, జడ్జీలు, మంత్రులు, పురపాలకవర్గము పాదచారులై నడుచుచుండుటచూడ మహాత్ముని మాహాత్మ్యము మనసుకు వచ్చెను.

ఎందరో రాజాధిరాజులు ఈ పట్టణమునకు వచ్చినది నాకు తెలుసును. దేశసౌభాగ్యమునకు పాటుబడిన దేశభక్తులలో ముఖ్యులగు సురేంద్రనాథ బెనర్జి, బిపిన్‌చంద్రపాల్, తిలక్ మహాశయుడు, గోపాలకృష్ణగోఖ్లే, లాలాలజపతిరాయి, సి. ఆర్ దాస్ మొదలగువారు మద్రాసుకువచ్చి ఉపన్యాసములను యిచ్చినది నాకు తెలుసును. అట్టివారి కెవరికిని ఈవైభవము జరిగియుండలేదు.

మహాత్ముని అస్థులను మద్రాసు గవర్నమెంటు మందిరమున ప్రతిష్ఠచేసిరి. ఆ అస్థులను పవిత్రమగు ఖద్దరు వస్త్రమున మూటగట్టిరి. ఆమూటను పుష్పకవిమానమందుంచిరి. అహోరాత్రములు నేతితో అఖండమును వెలిగించిరి. రాత్రింబవలు భక్తబృందము చేరి రామభజన సలిపిరి. బ్రాహ్మణులు వేదపారాయణమును చేసిరి. గృహలక్ష్ములు భక్తిగీతములను పాడిరి. కర్పూర హోమము జరుగుచునే యుండెను. సాంబ్రాణి ధూపము మందిరమంతయు కమ్ముకొనియుండెను. దర్శనమునకు వచ్చువారికి విరామము లేకుండెను. గవర్నమెంటు మందిరము కలియుగవైకుంఠముగ మారినది. ప్రతిదినము వచ్చిన జనము శ్రీరంగమున వైకుంఠయేకాదశినాడు ద్వార దర్శనముకు పోయినవారికంటె నూరురెట్లు అధికముగ నుండవచ్చును. దూరదేశములనుండి అన్నిజాతులవారును కంటనీరు కార్చుచు కడవలనిండుగ మేకపాలనుదెచ్చి మహాత్ముని ఆత్మకు నివేదనచేసిరి. రైతుబృందము మేలైన వేరుశనగలనుదెచ్చి విమానమునకు ముందుబెట్టి మ్రొక్కుచుండిరి. ధూపదీప నైవేద్యములతో 10 దినములు గవర్నమెంటు మందిరము పవిత్రతచెందినది.



పుష్పక విమానము.

—ఫ్రీ ఇండియావారి అనుమతితో

# మహాత్మాగాంధీ నిర్యాణము

శ్రీ వావిలికొలను వేంకటరమణరావుగారు

జగజ్జ్యోతిగా వెలుగుచున్న దీపము ఆర్పివేయబడునా? కాంతికి భంగమువచ్చునా? జ్యోతికి చీకట్లు క్రమ్మునా? దుష్టవాతాహత మయ్యెనేగాని తిరుగజ్యోతి ప్రకాశించును. జ్యోతికి కారుమబ్బు క్రమ్మినదేగాని వాయుప్రచ్ఛన్న మేఘరేఖవలె చీకట్లు తొలగి ప్రాణతేజస్సు వెలుగగలదు. నిరామయుమై, నిరంజనమై స్వప్రకాశముచే జగజ్జ్యోతివెలుగగలదు. జ్యోతిప్రకాశమును ఎవరుభంగము చేయగలరు. పరంజ్యోతి సంపూర్ణవ్యక్తి గదా?

ఓమ్ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్
పూర్ణముదచ్యతే - పూర్ణస్య పూర్ణమా
దాయ పూర్ణమే వావశిష్యతే.

మహాత్మాజీయొక సంపూర్ణవ్యక్తికాన పూర్ణత్వము పొందగలడు. 'సత్యమేదైవము - దైవమే సత్యము' అనివారి ధృఢనమ్మిక. వారు సత్యమూర్తులుగదా? సత్యము శాశ్వతమైన ధర్మము. వారి సత్యమూర్తియు శాశ్వతము. మహాత్ముడు తనప్రార్థనాంతర ఉపన్యాసము నొకనాడు ఇట్లు ముగించినారు :—

'మృత్యోర్మా అమృతంగమయ'

అనగా తన్ను మృత్యువునుండి అమృతత్వమునకు సాగింపుమని ప్రార్థించెను. వారి కాంగ్రెసు మిత్రులలో నొకరు వారితో నొకనాడు "అమృతత్వము నిచ్చు మార్గమొకటి (యోగము) భారతదేశములో అనుచరణలో నున్నదనియు, దాని సాధన ఇంకను పూర్తికాలేదనియు, పరిపక్వసమయము త్వరలో నున్నదనియు, ఆయోగసాధకులు తరుణమును వేచియున్నారనియు" చెప్పగా తన జీవితము ఇదివరకే ఒకవిషయమునకు అర్పణము చేయబడియున్నదని వారు జవాబు చెప్పినట్లు ఆ మిత్రుడు మాతో విన్నవించగా తెలిసినది. దేనికో ఎవరికో వారు వాగ్దానము చేసినది? వారి జీవితమంతయు మానవసేవకుకదా అర్పణజేసిరి? ఇది స్పష్టము - అనుమానములేదు - మహాత్మునికన్న భారతమాతను అధికముగ ప్రేమించినవారులేరు. వారి మరణము అతిప్రశస్థమైనది.

తే 30-1-48 ది సాయంప్రార్థనకు 10 నిమిషములు ఆలస్యమైన కారణముచే వేగముగ ప్రార్థనారంగమునకు రామధ్యానమునకు పోవుచుండిరి. అట్టి తరుణములో వారిని 'మృత్యువు' ఎదుర్కొని ప్రణమిల్లి తానుచేయబోవు ఘోరకృత్యమునకు క్షమింపగోరుచున్నదో యనునట్లు గుండ్లుప్రేల్చి ప్రాణము తక్షణములో హరించినది. మహాత్ముని జీవితము ఇట్లు వారి ఉచ్ఛస్థితిలో ముగిసెను, వారు కోరినట్లు ఈశ్వరుడు త్వరలో వారికి "అమృతత్వము" ప్రసాదించుగాత.



Telephone No. 2422
,, 2863—2446

బెంగుళూరులోనా ?

Telegrams.
'PLEASURE'

# శాస్త్రీస్ హోటల్‌లో బస చెయ్యండి

హోటల్ బృందావన్, హైగ్రౌండ్స్ హోటల్, రేస్‌కోర్సు యెదుట,
బెంగుళూరులో ఇదే అతి దర్జాయైన గొప్ప హోటలు ;

బస చేయదగినది. పేరుకుతగ్గ ప్రాశస్త్యముగలది ఇదొక్కటే. ఒకమారు వచ్చి చూడదగినది.



నవీనమయిన అన్ని ఏర్పాట్లతోను, సౌకర్యములతోను అలరారు ఉత్తమ తరగతికి చెందిన గొప్ప వసతిగృహమిది. సువిశాలమయిన, బాగుగా గాలివచ్చునట్టి గదులు, స్నానములకు ప్రత్యేక గదులు, అతి నవీనమగు శానిటరీ ఏర్పాట్లును గలవు.

ఫోన్ 2422

బ్రాంచ్:

శాస్త్రీస్ హోటల్, చిక్‌పేట్, బెంగుళూరు సిటీ.

చాలా మితమయిన రేట్లకు బాగుగా అన్నిసౌకర్యములు అమరియున్న విశాలమయిన గాలిగల గదులు. ఆంధ్రభోజనము ఒక ప్రత్యేక విశేషము.

ఇది చదవండి:

దివాన్ బహదూర్ డి. శ్రీరామశాస్త్రిగారు, ఎమ్. ఎల్. విశాఖపట్టణము, ఇలావ్రాశారు:

గతనెల 22 నుండి 24 వ తేదీవరకు మీబృందావనం హోటలులో బసచేసియుండిన నేనున్నూ మెసానిక్ అతిథులుగ వచ్చిన యితర మిత్రులున్ను ఇందుమూలముగా మా సంతృప్తిని, సంతోషమును మీకు తెలియపరచుచున్నాము. మేమున్న కొద్దిరోజులున్ను మీనౌకర్లు మాయెడల అతిశ్రద్ధ ఆదరణచూపియుండిరి; మా అవసరములన్నింటిని జాగ్రత్తగా అమర్చియుండిరి మాకిచ్చినగదులు పరిశుభ్రముగానుండెను. భోజన ఫలహారాదులు సంతుష్టికరముగను రుచ్యముగనుఉండెను. మీహోటలుకు సర్వసౌభాగ్య అభివృద్ధులను కోరెదను.

ఆంధ్రుల నవీన సర్వజనామోదమందిన హోటలు

శాస్త్రీస్ హోటల్, చిక్‌పేట్, బెంగుళూరుసిటీ వారి నిర్వహణక్రింద ప్రారంభింపబడినది.




22 తెల్లమద్దిచెట్టు:— ఈ చెట్టుయొక్క బెరడు సత్తువనిచ్చు పదార్థములలోనొకటి. దీనిని చాలామందివైద్యులు హృద్రోగములయందువాడెదరు. దీనిబెరడుతో కషాయమునుకాచి గుండెదడ, నీరసము, ఉదయాదిఅశక్తత మున్నగు వ్యాధులు గలవారికి వాడవచ్చును. బెరడును యెండబెట్టి చూర్ణించి వస్త్రకాళితమొనర్చి జాగ్రత్తపరచి దంతధావనమునకు వాడుకొనిన దంతములకు బలమిచ్చును. దీని బెరడునుకాల్చి మసిచేసి భస్మముగ వైద్యులువాడెదరు. ఇందు సత్తువనిచ్చు పదార్థముకలదు. మరియు మాననిగాయములను, లోతుపడిన చర్మగాయములను, కురుపులను, వ్రణములను కడుగుటకు దీనితో తయారొనర్చిన చూర్ణమును గోరువెచ్చనినీటిలో వేసియుంచుకొని కడిగిన గాయములు చీముబట్టకమానును. క్రిములను జంపును. గట్టిచేవగలదగుటచే దీనిని ముఖ్యముగ గృహోపకరణసామగ్రికి కూడ నుపయోగింతురు. ఇది రెండువిధములు. తెల్లమద్ది, నల్లమద్దియనియు కలవు.

23 అడ్డసరము:— ఈదివ్య ఓషధిమూలిక మనదేశములో చాలా ప్రదేశములయందు కానుపించును. ముఖ్యముగ తమలపాకుతోటలు, అవిశెతోటలు పెరుగునట్టి స్థలములయందు విరివిగ పెరుగును. దీని ఆకులను నలగగొట్టి సీటిలోవేసి కషాయముగగాచి విధానము ప్రకారము దింపి, రొమ్ముపడిశెము, దగ్గు, అజీర్ణము వాతప్రకోపములచేకల్గు దగ్గులు, కఫమువెడలక పలుమార్లువచ్చుపొడి దగ్గులు అనువానిచే బాధపడువారికి పూటకు అరఔన్సుచొప్పున యిచ్చిన శాంతించును. దీర్ఘకాలమునుండి బాధపడు క్షయవ్యాధులయందుతప్ప మిగత సమస్త శ్వాసకోశవ్యాధులయందు వాడవచ్చును. కషాయము వెగటుగతోచిన కలకండపొడి చేర్చవచ్చును. ఆయుర్వేదశాస్త్రజ్ఞులు అందరూ ఆచరణలోపెట్టి పలువిధవ్యాధులు నివారింపచేసినట్లు డాక్టరుకోమర్ గారి రిపోర్టువల్ల తెలియుచున్నది.

24 తిప్పతీగ:— అడవులలో యెత్తుగాపెరిగియుండు చెట్లపై ప్రాకును. చాలా మొండిది. స్వశక్తిగలఓషధి. ఋతుధర్మముననుసరించి సమూలముగాయెండి మరల తనంతతాను జీవించశక్తిగలఓషధి. దీనిని సమూలముగ వాడవచ్చును. తిప్పతీగ త్రిదోషహారమని చెప్పుదురు. నిజము. వైద్యులకు అమృతమువంటి మూలిక. వైద్యులు పొరపడినను దోషగుణరాహిత్యము చేయును. మంచి బలమిచ్చును. పెక్కుఔషధముల సంపుటములలోచేరును. పురాణజ్వరములకు అస్తిగతజ్వరములకు మిగుల ఉపయోగకారి. శ్వాసకోశవ్యాధులయందు విరివిగావాడనగును. దీనితో వైద్యులు తిప్పసత్తుతీసి జాగ్రత్తపరచి యుంచుకొనియెదరు. దీనిని దేశీయ క్వయినాయనియుకూడ చెప్పుదురు. దీనితో తయారయినసత్తు తెల్లగాను, శుభ్రముగాను, మెత్తగనుండుటవల్లనే జీర్ణాశయమునందు త్వరితముగ జీర్ణమయి గుణము నిచ్చును.

చంటిబిడ్డలకు మేహకారకముచే కొన్నివేళల మూత్రములో తెలుపు లేక సుద్ద పడిపోవుచుండును. అట్టివారికి పంచదారలో కల్పిగాని, చల్లని మంచినీళ్లలో కల్పిగాని యిచ్చిన నెమ్మదగును. వాడుకవల్ల పెక్కువ్యాధులు నెమ్మదించెనని డాక్టరుగారు తెలిపిరి. మరియు దీనితో సరిసమానముగపనిచేయు అల్లము, మంచి గంధముపొడి, పర్పాటకము మొదలగు వానితో కషాయమొనర్చి జాగ్రత్తపరచి జ్వరములకు వాడుకొనుచుండవలయును. మధుమేహవ్యాధులయందు మూత్రములో యుండు Sugar (తీపి)ను తగ్గించుటలో అనువగుమూలిక.

# ఇంటిపనులలో మెళుకువలు

## పిల్లల పెంపకములో పొగడ్త, మెప్పు

శ్రీమతి సరస్వతి చెన్నకేశవన్‌గారు ఎం.ఏ.

ఒకవ్యక్తి జీవితములో, కొన్నికొన్ని భావాలు, ఎల్లప్పుడూ వుత్సాహము కలిగించుతూంటాయి. ఆవ్యక్తిచేయు ప్రతిపనియందు, ఆభావచ్ఛాయలు కనబడుతూ వుంటాయి. వాటిలో ముఖ్యమైనవి పొగడ్త, మెప్పు. పొగడ్తకు లోబడని వ్యక్తి చాలా అరుదు. మెప్పునకు సంతోషించనివారు, అల్పసంఖ్యాకులైన కర్మసన్యాసులొక్కరే.

ఈరెండుగుణములును పిల్లలపెంపకములో కూడా, అమిత సహాయకారులుగా నుండగలవు. పెద్దల వలెనే చిన్నపిల్లలు కూడా, వీటికిలోబడి నడుచుకుందురు. కనుకనే తలిదండ్రులు, ఉపాధ్యాయులు, మొదలగువారు, ఈగుణముల ప్రయోజనమును కనిపెట్టి నడుచుకొనుట ముఖ్యము. ఒక్కటొక్కటిగా తీసికొని వీటిని పరిశీలింతము.

పొగడ్త అంటేముఖస్తుతిగాదు. స్వార్థములో ఉత్పత్తినొంది యుక్తాయుక్త విచక్షణలేక, ఏదిచూచిన పొగడుట మంచిదికాదు. మనుష్యులకు స్వాభావికముగా, కొన్నిగుణములుండును. ఈనైసర్గికగుణములే, బాహ్య వ్యవహారములకు పునాది. వాటి అన్నింటిలో వ్యక్తిత్వమును బలపరచుకొనుట ముఖ్యమైనది. అంటేతనపలుకు, తనభావము, తనవ్యవహారము, ముఖ్యమైనదని అనిపించుకొనుట. ఈనైసర్గిక గుణములను ఆధారపరచుకొని, పిల్లలపెంపకములో పొగడ్తమెప్పు అను నీరెండింటిని విరివిగా ఉపయోగపరచి, వారిని సవ్యమైన దృక్పధమునకు తేగలము.

పిల్లలలో అనేకరకముల వారున్నారు. కొంతమంది స్వతః తెలివితేటలు గలిగి ఒకరి సహాయము లేకనే, తమ తమకార్యములను చేసుకోగలరు. మరికొంతమంది ప్రతిదానికి పెద్దల చెప్పుచేతలపై ఆధారపడుచుందురు. కాని ఈరెండు విపరీతపు తెగలమధ్యనున్న వారే అసంఖ్యాకులైన సామాన్యపు పిల్లలు, ఇటువంటి వారిలోను తమసంతోషమునకు ఆటలకు, మిగతావారిమీద ఆధారపడువారున్నారు. అట్లుగాక తమకు తామే తృప్తిచెందువారు వున్నారు. వీరందరిని కూడా పొగడ్త, మెప్పు అను నీరెండింటి ప్రయోగము వల్ల చాలవరకు మార్చగలము.

ఒకనాలుగేళ్ల పిల్లవానిని తీసుకుందము. వాడేదయినా, పనిచేసినప్పుడుగానీ, చేస్తూవున్నప్పుడుగానీ, చుట్టుప్రక్కల ఎవరైనా వున్నారా, తవున్నవాళ్లు తనపనిని చూస్తూవున్నారా, చూచినతర్వాత బాగుందంటారా లేదా, అనే ఆవేదనపడుతూవుంటాడు. కాలితోనో, లేక Bat తోనో బంతినితన్ని, మనవంక చూస్తాడు. అప్పుడు మనము, “బలే, ఎంతబాగా తన్నావు” అంటే, వుప్పొంగిపోయి, మరల పరుగెత్తుకుంటూ పోయి ఆపనేచేస్తాడు. తనుప్రేమించి గొప్పగా అనుకొను నటువంటి తల్లితండ్రులో లేక ఇతరులో, తన్ను మెచ్చుకొన్నారంటే, వానికి ఎంతో అహ్లాదము కలిగిస్తుంది.

అదేరకంగా, బడికెళ్లి చదువుకొనే పిల్లవానికూడాను. ఉపాధ్యాయుడు, సర్వవిద్యాధికుడనియు, దైవసమానుడనియు, పిల్లలతలంపు. అటువంటి ఉపాధ్యాయుడు, తనపనిని మెచ్చుకున్నాడంటే, పిల్లవానికి అమితవుత్సాహము. ప్రోద్బలము గలుగుతుంది.

మరికొంత పరిశీలించిన మెప్పునకును, పొగడ్తకును, ఇంతప్రభావముండుట, వేరుకారణలమువలన అని తోచకమానదు. ఎంతటి ముక్కారబుద్ధిగల పిల్లవాడయినను తాను ప్రేమించిన వారిచేత "మంచి" అనిపించుకొనుటకు, సకల ప్రయత్నములు చేయును. పిల్లలకు, తాము ప్రేమించినవారే ఆదర్శభూతులగుదురు, వారిని సంతోషపెట్టడమే వారిముఖ్యవిధి. వారుసంతోషపడినట్లు పిల్లలకు తెలియుట ఈపొగడ్త, మెప్పు, అను ఈబాహ్య ఆధారముల మూలాన్నే. పెద్దవారు జీవితములో జయాపజయములను లక్షించునటులే, పిల్లలు కూడా తమచిన్నచిన్న పనులలో పొగడ్తను ఆశించుచుందురు.

కాని, ఇందులో పెద్దల బాధ్యతయేమి, అనివిచారించ వలసి యున్నది. తల్లిదండ్రులకు ఏకపుత్రుడనియో లేక ప్రథమపుత్రుడనియో, ప్రతివిషయమునందును, పిల్లవానికి అపజయము, అప్రియము, అనునది యేదియో తెలియక, పెంచడము సర్వానర్థములకు మూలము, పక్కయింటి పిల్లవానిని బాగా కొట్టి, వాని దగ్గరనున్న ఆటవస్తువును, లాగికొని వచ్చిన పుత్రరత్నమును, మెచ్చుకొనుటకన్న వేరుమూఢత్వముండదు. చాలా గేర్వరితనముతో అబద్ధాలాడు పుత్రికనుపొగడు తల్లిదండ్రులు, అంతకన్నఘోరమైన తప్పునుచేయులేరన వచ్చును. ఇటువంటి మెప్పువలన, యుక్తా యుక్త పరిజ్ఞానము లేనిపిల్లలు తాముచేయు కార్యములు మంచివను తలంపుతో వాటియందే ప్రావీణ్యత సమర్థింపజూతురు.

మంచిపనులను, స్వార్థరాహిత్యములైన పనులను, చేసినప్పుడు పిల్లలను మెచ్చుకొనుట, పొగడుట, అత్యావశ్యకము. అప్పుడే వారికది మంచిదనియు, దానివలన వారుమనలను, సంతోషపరచగలరనియు, తెలియును. కాని, ఈవిధముగ పిల్లలకు పెద్దలు ప్రోత్సాహము నీయవలయుననిన, ప్రతిసమయమునందును, పిల్లల వ్యవహారములను, ఆటపాటలను గమనించవలసి యుండును. అప్పుడు కాని, వారిని పొగడి ప్రోత్సహించుటకుగాని కోప్పడి నిరుత్సాహపరచుటకుగానీ, వీలుండదు. ఒకముఖ్యవిషయముకూడా గమనించవలసియున్నది. ఏదికానీ, అధికమైన, దానివిలువ ఏవిధముగా తగ్గిపోవునో, ఆదేవిధంగా ప్రతిచిన్నవిషయమునకు, ప్రతిపనికి, పిల్లలను పొగడుచుండిన వారికి దానివిలువ చెడిపోవడమేకాక, తాము అన్నివిధముల ప్రజ్ఞావంతులన్న అహంభావము పిల్లలకు తప్పకుండా గలుగును. ఎంతో ప్రయత్నించినగాని, అది ఎంతో గొప్పవిషయము పట్లగాని, పిల్లలను మెచ్చుకోరాదు. ఏదైనా, నిజంగా మెచ్చుకోదగిన పనిచేసినప్పుడుగాని, వారిని పొగడరాదు. అలాగని ఎప్పుడూ గమనించకుండా వున్నాకూడా తప్పే. అప్పుడు పిల్లవాడు నిరుత్సాహుడై, ఏమిచేసినా ప్రయోజనములేదని అసలు ప్రయత్నము చేయుటయే మానివేయును.

కొన్నిసమయములందు, ఈపొగడ్తనే, వేరువిధములుగా సూచించవచ్చును అంటే అబ్బాయి, నిజంగా మెచ్చుకోదగ్గ పనిచేసినచో, వానికియిష్టమైన బహుమానమునిచ్చిన, మనసంతోషము మెప్పు, వస్తురూపమున గనబరచిన వారమగుదుము. ప్రేమ ఆధారముగాగొని, ఎటువంటి పిల్లలనైన, సవ్యమార్గమునకు త్రిప్పగలము.

ఇటువంటి మెప్పు, పొగడ్తపొంది పెరుగు పిల్లలయందు, వ్యక్తిత్వము బాగాపెంపొంది, ధైర్యశాలురగను ఆత్మాశ్రయులుగను, వృద్ధిపొందుటకు వీలగుచున్నది, కాని ఇందులోకూడా పొగడ్తకంటే మెప్పునకే, ముఖ్యస్థలము యివ్వవలసియున్నది. "పొగడ్త"అను పదమునకు, వ్యవహారపు పొరపాటువలన, స్వార్థపరమైన ముఖస్తుతిఅను అర్థము గల్గినది. పిల్లలయెడ అటువంటి పొగడ్తకు తావులేకపోయినను, అనర్థముయిచ్చు, ఆపదమును వాడకుండుటయే మేలు. మెప్పు అనగా కార్యము విలువదెలిసి దానిని మెచ్చుకొనుటయే. సామదాన భేదదండములలో ముఖ్యమైన సామమార్గాను సరణమే ఈ 'మెప్పు,'. దీనికి ఎటువంటివారును లోబడకమానరు.

—A. I. R. వారి అనుమతిని

(0)

చక్కెరపాకు:-



గతమాఘము మాగృహలక్ష్మి సంచికలో "థర్మామీటరు" అనువేడినిచూపు డిగ్రి సహాయముతో శాస్త్రరీత్యా పలువిధములగు పాకు, పక్వవిధానముల వివరములు తెల్పియుంటిమి.

ఇకను అనుభవరీత్యా పాకుపక్వములను సులభముగ గ్రహించుటకు వీలగునట్లు వ్రాయుచున్నాము. కళాయిగల శుభ్రమయిన ఇత్తడి పాత్రలో మూడుపాళ్లుజలము అయిదుపాళ్లు పంచదారనుపోసి నీళ్లలోకరుగనీయ వలయును. (అనుభవముకలుగుటకు ముందు ఉజ్జాయింపుకంటే తూచివేసుకొనుటయే మంచిది) అటుపైన బొగ్గులపొయ్యిమీద నుంచుము. కలియబెట్టుము. సుమారు మూడుపొంగులు వచ్చిన తర్వాత సుమారు వక గంటెడు నిమ్మకాయరసమును అందులోపోసి మరల కొంచెముసేపుకాగిన తర్వాత పొయ్యిమీదనుంచి పాత్రను దింపి, తెర్లుచూ పైన తేరియుండు మురికిని జల్లిరిగంటెతోటి తీసివేయవలయును. అటుపిమ్మట మంచిశుభ్రమయిన మల్లుముక్కను తగునట్లు చింపి ఆ పాత్రపైన కట్టి మరల నిర్ధారణచేసుకొని నిల్వయుంచదగిన పండును వేసి కాచవలయును.

అయితే పాకము తగునంతవరకు చిక్కపడిన తర్వాత కలియపెట్టిన ముద్దలు ముద్దలుగా యేర్పడునుగాన వకేపనిగా కలియపెట్టకూడదు.

మరియొకవిధము: పైవిధముగనే నీళ్లు చక్కెర, భాగములప్రకారము గ్రహించి నిమ్మకాయ రసమునుకూడ చేర్చి కాచవలయును. ఇప్పుడు సుమారు వకగిన్నెడు నీళ్లుచేర్చవలయును. పిమ్మట మరియొక కూజావంటి పాత్రలోనీళ్లు తీసుకొని యెత్తాంటి ప్రదేశముపయిన నిల్చొని యేకధారగా కూజావంటి పాత్రలోని నీళ్లుపోయవలయును. పాకమువచ్చువరకు కాచవలయునేగాని పాకము ముదిరి మండిపోవువరకు వుంచగూడదు. కాచుట, పొంగుట, చల్లారుట మొదలగువిషయములు గమనించవలయును. తయారయిన పాకములో యేపదార్థములతో పండుతో పాకముచేసి నిల్వవుంచ దలచుకొంటిమో దానిని వేయవలయును.

మరియొకవిధము:-

పయిన చెప్పినవిధమున పంచదారనీరు గ్రహించవలయును. పావుభాగము నీటిలో పంచదారనంతను వేయవలయును పావుభాగముకు సరిపోవునట్లు పాలను చేర్చవలయును. ఇట్టిదానిని పొంగులు వచ్చువరకు వుంచుము. అప్పుడు మిగిలియున్న పాలలో ఒకభాగంచేర్చి మరల మరియొక పొంగువచ్చువరకు కాచి పైనుండు మురికిని

తీసివేయుచూ శుభ్రముగ నున్నదని తెలుసుకొనిన పిమ్మట శేషించిన పాలను కూడ కల్పుము. నిశ్చయము చేసివుంచిన ఫలమును కూడ చేర్చుము.

మధురపదార్థములు నిల్వచేసుకొను పాకము తయారుచేయునప్పుడు నీళ్లుకొంచెము తగ్గినను, మంచిదేకాని ఫలములతో తయారు చేయవలసివచ్చినప్పుడు సమభాగములు లేకున్న పాకము ముదిరి మండుటగాని ఫలము సరిగావుడకక పోవుటగాని తటస్థించుచుండును గాన అవసరముకొలది నీళ్లు యెప్పటికప్పుడు చేర్చుకొనుచుండవలయును.

పాకును బొటనవేలితో తీసుకొని మరియొక వేలితో వత్తి విడదీసిన యేర్పడునట్టి సన్నని, పల్చనిపాకముతోటి ఫలపాకములు నిల్వయుంచుకొనుటకు వుపయోగపడును. వకవేళ పాకమే చిక్కపడినయెడల మరల కాచుటయే అవసరమని తెలుసుకొనవలయును.

పాకుపయిన బుడగలవలెను ముత్యములవలెను, చిన్నబుగ్గమాదిరి వచ్చుటయు, (పాకు చేతితోనలిపిన చిన్నవుండ, లేకమెత్తని వుండపాకము) నగుటయువల్లనే పాకము సంసిద్ధమయినదని తెలుకొనవలయును. ఇంకనుచిక్కగ ముదురుగ పాకము తయారుకావలెననిన అతిశ్రద్ధగ పొంగులను గమనిస్తూ వుండయగు స్థితికి వచ్చునప్పుడు మాడకుండునట్లు చూచుటయే అనుభవనీయమయిన పాకపద్ధతియని అందుము.

మంచినాణెమయినట్టి పరిశుభ్రతగల చక్కెరతో తయారగునట్టి పాకములవల్ల చేయుపదార్థములే నిల్వవుంచుటకు తగియుండును.

ఇకముందురానున్న సంచికలో పలువిధములయిన మధురపదార్థములు, మురబ్బాలు, మొదలగునవి చేయుటకు వీలగు పద్ధతులు వివరించబడును.






### : వెలగపండు పెరుగుపచ్చడి :

వెలగపండు గిజారునుతీసి పెరుగులో పల్చగాకలిపి, పచ్చిమిరపకాయ ముక్కలు, కొత్తిమిరాకు కలిపి ఆవాలు తిరగమాత వేయవలయును.

### :మామిడికాయ పెరుగుపచ్చడి:

ముదురు మామిడికాయలను చెక్కుతీసి సన్నగతరిగిగాని, తురిమిగాని పెరుగులోకలిపి ఉప్పు, పచ్చిమిరపముక్కలను, కొత్తిమిరాకును పెరుగులో కలుపవలయును. ఆవపెట్టినకూడ బాగుండును. కడపట తిరగమాత వేయవలయును.

### :మామిడిపండు పెరుగుపచ్చడి:

మామిడిపండు తోలుతీసి లోపలిగుజ్జును పెరుగులోకలుపవలయును. పండ్లు పుల్లగనుండిన కొద్దిగ బెల్లము, చేర్చినమంచిది. ఆవకూడపెట్టవచ్చును. సన్నగ పచ్చిమిరపకాయలనుతరిగి, కొత్తిమిరాకును, ఉప్పుచేర్చి తిరగమాత వేయవలయును.

### :వంకాయ పెరుగుపచ్చడి:

వంకాయను కుమ్ములోపెట్టిగాని, బాణలిలోవేయించిగాని, నీళ్లలోఉడికించిగాని తోలుతీసిపెరుగులో కలిపి, ఉప్పు, పచ్చిమిరపకాయముక్కలు, కొత్తిమిరివేసి ఆవాలు, జీలకర్ర, ఇంగువ తిరగమాతవేసి వాడుకొనవలయును.

### :ఉసిరికాయ పెరుగుపచ్చడి:

పచ్చిఉసిరికాయలను తొక్కిగాని, నిల్వవుంచిన ఉసిరికాయతొక్కుగాని పెరుగులోకలిపి, ఉప్పు, ఇంగువపాలు పచ్చిమిరపకాయలు, కొత్తిమిరివేసి తిరగమాతవేయవలయును. ఉసిరికవరుగును మజ్జిగలోనానపెట్టి నూరిపెరుగులోకలిపికూడ చేయవచ్చును.

### :బెండకాయ పెరుగుపచ్చడి:

లేతబెండకాయలనుదెచ్చి సన్నబిళ్లలుగ తరిగి వేయించిగాని, పచ్చివిగగాని, పెరుగులోకలిపి, ఉప్పు, పచ్చిమిరపముక్కలు, ఇంగువపాలు, కొత్తిమిరినికలిపి తిరగమాత వేయవలయును.

### :పొట్లకాయ పెరుగుపచ్చడి:

లేతపొట్లకాయలనుతెచ్చి, లోపలయుండు విత్తులనుతీసివేసి, వాడ్చిగాని, పచ్చిదిగగాని బెండకాయపచ్చడివలెనే చేయవలయును.

### :దొండకాయ పెరుగుపచ్చడి:

దొండకాయపచ్చడికూడ బెండకాయవలెనే చేయవచ్చును.

### :అరటిపండు పెరుగుపచ్చడి:

పండిన అరటిపండును సన్నబిళ్లలుగతరిగి, పెరుగులోకలిపి, ఉప్పు, పచ్చిమిరపకాయలు, కొతిమీరి వేసి తాళించెదరు. లేక పండును పెరుగులోకలిపి, చక్కెరనుకలిపి, భుజించెదరు.

### :ఉల్లగడ్డ పెరుగుపచ్చడి:

ఉల్లగడ్డలను ఉడికించి పైతోలుతీసి పిండివలెపిసికి, పెరుగులోకలిపినపిమ్మట, ఉప్పు, పచ్చిమిరపకాయ, కొతిమీరివేసి తిరగమాతపెట్టి వాడుకొనవలయును. గెనుసుగడ్డనుకూడ యిట్లేచేయవచ్చును.

### అప్పడాల పిండిపెరుగు పచ్చడి:

'దీనిని డాంగరు పచ్చడి' అనెదరు. ఉద్దులపిండిని పెరుగులోకలిపి ఇంగువపాలు, ఉప్పునుకలిపి, ఆవాలు తాళించి వాడుకొనవలయును.

# సోమపాట (ద్విపద)

వంగోలు వెంకటరంగయ్యపంతులుగారు, బి.ఏ., బియల్.

(సేకరించి పంపినది)

వేదోదితంబగు విహిత యజ్ఞమున
మొదటనె యాధాన[19] మని మునులండ్రు
హోమపూర్వక మిష్టిపూర్వక మ్మనియు
సోమపూర్వకమని; సొంపలరుచును
సోమయాగముచేయ జొచ్చుటకు ముందు
సోమపూర్వకమండ్రు సోమజ్ఞులెల్ల.
అటువంటి యాధాన మమరంగ జేసి
అటువెన్క యజ్ఞ సంకల్పము[2] జేసి
వరుసతో సోమప్రవాకాదు[21] లయిన
వరగుణాఢ్యుల వేదవిదుల వరించి
బుధులగు పదియారు[22] భూమి దేవులకు
మధుపర్క[23] పూజల మన్నన జేసి
దక్షిణల[24] బెట్టి దీటు మీఱగను
వీక్షింపవే నీలవేణి[25] వేడుకల.

దీక్షించినట్టి[26] యాదీర్ఘదర్శనుల
సాక్షాత్కరించిన సారసాక్షుండె.
అజినము[27] దాల్చిన యతిపుణ్యుడితడు
విజితకాముడౌచు విధి సేయదొడగె.
జింకకొమ్ము[28] ధరించి చెలువు మీరగను
పంకజానన చూడు పద్మాసనుండె.
దీక్షితులయిన యీదంపతుల జూడు
దాక్షాయణీశుల దలపనేమిటికె?
ఎన్నికమీరిన యెన్ని పుణ్యముల
పన్నెనో శివదీక్ష[29] పరత యీతనికి?
కడుపార నీతని కనినట్టి తల్లి
కడు నెన్ని నోముల కాంక్ష జేసినదో?
చాలభాగ్యవతెమ్మ చానయీకొమ్మ
జాలముతో నితని జెట్టపట్టినది.

---

19 ఆధానము—ద్విజులకు గార్హపత్య దక్షిణాగ్న్యాహవనీయముల నుంచికొను నధికారము కలుగ జేయు క్రతువు. ఆధానము అగ్నిష్టోమాదులకు పూర్వాంగము. ఆధానము జేసినగాని అగ్నిష్టోమాదులజేయ నర్హతకలుగదు. ఆధానమున పశువులేదు. ఆధానము జేసి త్రేతాగ్నుల నుంచుకొనిన వారిని తెలుగుజిల్లాలలో దీక్షితులనియు హావిర్యాజియనియు చెప్పుదురు. సోమయాజినిగూడ దీక్షితులని అరవవారు వ్యవహరించు నటులున్నది. ఉదాహరణము అప్పయ్యదీక్షితులుగారు. కొందరు ఆధానమును వేరుగజేయక యజ్ఞముతో కూడనే ముందుదినము ఆధానము, తర్వాతయజ్ఞసంకల్పము జేయుదురు. ఆధానమునకు ఋత్విక్కులు: ఆధ్వర్యువు; హోతా, బ్రహ్మ, ఉద్గాతా, అగ్నీధ్ర, సదస్య; వీరు ఆర్గురుమాత్రమే.

హోమపూర్వకమిష్టి పూర్వకము. తై. సంహిత ౧-౫-౧ ఈ విచారముకలదు.

బ్రాహ్మణునికి సోమపూర్వత్వమే నియతము. క్షత్రియ వైశ్యులకు ఇష్టిపూర్వత్వనియమముఅని సాయన వేదభాష్యాభిప్రాయముగ నున్నది.

ఇష్టిసోమయోః పౌర్వాపర్యం ననియమం.

20 యజ్ఞసంకల్పము: అగ్నిష్టోమారంభమునకు పూర్వదినముననే నాందీశ్రాద్ధము జరుగును. రాత్రి ఉదకశాంతి, కంకణబంధనము. మరునాడు తెల్లవారగనే యజమానుడును (యజ్ఞముచేయువాడు) అతని

పత్నియు పదియారుమంది ఋత్విక్కులును, మంగళస్నానమును చేయుదురు. ఆవల పుణ్యాహవాచనము జరిగించి యజమానుడు పత్నీసమేతుడై గార్హపత్యాగ్నికుండమునకు పశ్చిమముగ కూర్చుండి ప్రాణాయామము చేసి విష్ణుస్మరణచేసి 'యాఃపురస్తా' దిత్యాదినివిష్టమిత్వముగ జపించి అంతట దేశకాల సంకీర్తనముజేసి

"(విచ్ఛిన్న సోమపీథ సంధానార్థ మైంద్రాగ్నేన పశునా దారాబ్రహ్మణ్య పరిహారార్థ మాశ్వినేన పశునాచ, అగ్నిషోమయేణ పశునా సమాన తంత్రంయక్ష్యమాణః ద్వాదశ స్తోత్రేణ ద్వాదశ శస్త్రేణ రథన్తతరసామ్నా సప్రివర్గ్యేణ శతగవదక్షిణేన జ్యోతిష్టోమేనాగ్నిష్టోమ సంస్థేన చతుష్టోమేన సోమేన స్వర్గకామోయక్ష్యే"

అని ముమ్మారు ఉపాంశుగాను (మెల్లిగాను), ముమ్మారు ఉచ్చైస్స్వరముతోను పలుకవలయును. ఇదిసంకల్పము, పైన ఉదహరించిన ప్రమాణము శ్రౌతపదార్థనిర్వచనమను గ్రంథమునుండి గ్రహింపబడినది.

21 సోమప్రవాకుడు: అగ్నిష్టోమీయ యజ్ఞమునకు బ్రహ్మ మొదలగు పదియారుమంది ఋత్విక్కులను పిలుచుకొనివచ్చి యేర్పాటుచేయు అధికారమునకు యజమానునిచే వరింపబడిన అధికారి. ఇతనికి బ్రహ్మ హోత, అధ్వర్యులతోపాటు నూరుగోవులదక్షిణ. షోడశఋత్విగ్వరణమైనపిదప సోమప్రవాకు డక్కరలేదు.

22 అగ్నిష్టోమాది క్రతువులకు కావలసిన ప్రధాన ఋత్విక్కులు పదియారుమంది. వీరు ఒక్కొక్క గణమునకు నలుగురివంతున నాలుగు గణములుగ ఏర్పరుపబడుదురు:—

1 హోతృగణము. 2 అధ్వర్యుగణము. 3 బ్రహ్మగణము. 4 ఔద్గాతృగణము ఈ పదియారు మందిచేరిన సమూహమునకు విహారమనిపేరు. హోతృగణమున ముఖ్యుడు హోత. మిగిలిన ముగ్గురు—మైత్రావరుణుడు, అచ్ఛావాకుడు, గ్రావస్తుత్. అధ్వర్యుగణమునకు ప్రధానుడు అధ్వర్యువు. మిగిలిన ముగ్గురు: ప్రతిప్రస్తాత, నేష్టా, ఉన్నేతా. బ్రహ్మ గణమునకు ముఖ్యుడు బ్రహ్మ. మిగిలిన ముగ్గురు: బ్రాహ్మణాచ్ఛంసి, ఆగ్నీధ్రుడు, పోతా. ఔద్గాతృగణమున ముఖ్యుడు ఉద్గాత. మిగిలిన ముగ్గురు: ప్రస్తోత, ప్రతిహర్త, సుబ్రహ్మణ్య. ఈ పదియారుమందిగాక యజ్ఞీయపాత్రలను (దర్వి, ధ్రువ, జుహు ఇత్యాదులను) శోధనచేసి శుభ్రపరచుచుండుటకును, అప్పుడప్పుడు కావలసిన వానినందిచ్చుచుండుటకును, పదిమంది చమసాధ్వర్యులను వారును వరింపబడుదురు వీరు అధ్వర్యుగణము ననుసరించియుందురు. (వీరికిది అప్రెంటిస్ విధానమువంటి దనుకొనుడు.)

సోమప్రవాకుడుపోయి ప్రధాన ఋత్విక్కుల నాహ్వానించునపుడు ఆతనికిని ఆహ్వానింపబడుఋత్విక్కులకును ఈ క్రిందజెప్పిన విధమున సంభాషణ జరుగునటుల కల్పమునగలదు:— ఉదాహరణము:—

సోమప్రవాకుడు బ్రహ్మత్వమునకు వరింపబడు ఋత్విక్కు నొద్దకు పోవు ననుకొనుడు. అట్లుపోయి యజ్ఞదత్తశర్మ సోమయాగము చేయబోవుచున్నాడు; దానియందు తాము బ్రహ్మత్వమంగీకరించి జరిపింప వలయును—అనును.

అంతట బ్రహ్మ:—ఏమియజ్ఞము? ఋత్విజులెవరు? దక్షిణయెంత?—అనిసోమప్రవాకునడుగును.

సోమప్రవాకుడు; జ్యోతిష్టోమమనియో, అగ్నిష్టోమమనియో, సంకల్పింపబడిన యజ్ఞముపేరును— రంగనాథశర్మ మొదలగువారు ఋత్విజులనియును, నూరుయావులు దక్షిణయనియును బదులుచెప్పును. ఈ విధముగ సోమప్రవాకునికిని పదియారుమంది ఋత్విక్కులకును సంభాషణ జరుగును.

ఈపదియారుమంది ఋత్విక్కులును వారివారి వ్యాపారములను చక్కగ జరుపుచున్నారా? యజ్ఞకర్మ మంత్రలోప, తంత్రలోప, క్రియాలోపములు లేకుండ యథావిధిగ జరుగుచున్నదియా? యని కనిపెట్టి పరీక్షించి చూచుచుండుటకు సదస్యులుఅని కొందరు నియమింపబడుదురు. వీరు ఋత్విగ్గణములలో చేరినవారుకారు. వీరికిని వారి వారి అధికారములకు తగినటుల దక్షిణలుగలవు.

హోతృగణము ఋగ్వేదమంత్రములతో సంబంధపడియుండును. అధ్వర్యుగణమునకు యజుర్వేద మంత్రములు ఔద్గాతృగణమునకు సామవేదమంత్రములు, బ్రహ్మకు అన్నియు వచ్చియుండవలయును. సదస్యులును అట్టివారుగనే యుందురు.

23 ఋత్విగ్వరణమయినపిదప వీరికి అర్ఘ్యపాద్య మధుపర్కాది పూజలు జరుగవలయును. మధుపర్కమనగ మధు (తేనె) మిశ్రిత దధికి (పెరుగు) పేరు.

24 అగ్నిష్టోమ దక్షిణలు మొత్తముమీద 112 ఆవులనియు వానిలో 12 సదస్యునికనియు మిగిలిన నూరును గణమునకు ఇరువదియైదు వంతున నాలుగు గణములకు పంచిపెట్టవలయుననియు, ఒక్కొక్కగణమున కీలడు యిరువది అయిదింటిలో గణములో ప్రధానపురుషుడయిన హోతయో, అధ్వర్యుడో, బ్రహ్మయో, ఉద్గాతయో—ఈతనికి పండ్రెడును, వీరివెనుక వారగు వారి కొక్కొక్కరికి మూడేసియనియు, శ్రౌతమను ద్రావిడగ్రంథమునను్నది.

25 నీలవేణి: యజ్ఞమును చూడవచ్చిన స్త్రీలు తమలోతాము సంబోధించుకొని సంభాషించుట.

26 యజ్ఞదీక్షపొందిన యజమానుడు—క్షౌరము మొదలగు నియమములచే నేర్పడు సంస్కారముదీక్ష. భోజననియమము మొదలగువానిచే నేర్పడునది తపస్సు.

కృష్ణయజుర్వేద 6-1-1-2 చూడుడు.

యజమానపత్నికిని దీక్షకలదు.

27 యజ్ఞదీక్షాంగముగ దేహాచ్ఛాదనమునకు యజమానుని కొక జింకచర్మమిత్తురు. ఇదియే అజినము. ఆతడు కూర్చుండుటకును పండుకొనుటకును నిదియేఅగును.

28 యజ్ఞదీక్షా విషయమై కొన్ని సంకేతములుగలవు. యజ్ఞదీక్షవలన యజమానునికి తృతీయజన్మ మైనటులని మనుస్మృతి. 2—169.

మాతురగ్రేఽధిజననం ద్వితీయం మౌంజిబంధనే।
తృతీయం యజ్ఞదీక్షాయాం ద్విజస్య శ్రుతిచోదనాత్ ॥

(సన్యాసమువలన నాల్గవజన్మయనియు చెప్పుదురు.)

శ్రుతిః :—

గర్భోవా ఏష యద్దీక్షితః

తై. సం. 6-1-3 చూడుడు.

యజ్ఞదీక్షచే నూతనజన్మలభించి నట్లుండుటచే నూతనశిశువునకు చేయు నుపచారముల అనుకరణము ఈదీక్షలో దీక్షితునికి చేయబడును. పసిబిడ్డలకు వ్రేళ్లుసాగక ముడుచుకొనియుండుట కనుకరణముగ వ్రేళ్లనుముడిచి కట్టివేయుదురు. జిలపుట్టినయెడల గోకికొనుటకుగాను జింకకొమ్మును చేతికి కట్టెదరు. పసిబిడ్డకు ఆముదమునుపూయుట కనుకరణముగ ఈతనికి వెన్నబూయుదురు. పసిబిడ్డకు పాలేఆహారమై నటుల ఈతనికి దీక్షాకాలములో ముఖ్యాహారము క్షీరములే.

29 శివదీక్ష: ఆపస్తంబీయాది శాఖాసూత్రముల ప్రకారము జరుగు నుపనయనస్థానమున ఆరాధ్యులు లోనగు వీరశైవులు శివదీక్షయనియొక క్రియ జరిగించుకొనెదరు.

యాగపశువును రుద్రునిపేర యూపమునకు కట్టివేయుదురట.

"ఇమంపశుం పశుపతేతేఽద్యబధ్నామి."

ఈ వ్యాపారమునకును శివదీక్షయను సంకేతము కలదట. (సశేషము)

# స్త్రీ సమస్యలు

శ్రీమతి సూర్యదేవర శకుంతలాదేవిగారు

1. హైందవులలో ఇంకా అత్త,కోడళ్లు తగవులాడుకొనే ఆచారముపోలేదు. ఎందువల్ల?

జః- అవును; కొడుకును ఎంతో కష్టపడిపెంచి కొత్తగావచ్చిన కోడలి అదుపు ఆజ్ఞలలో అప్పంగిచాననే భయము. ఇన్ని సంవత్సరములుగా ఇంట్లోపెత్తనము చాకిరి చేస్తుంటె మధ్యలో ఇదేమిటా అని సందేహము. పూర్వము చచ్చేచాకిరిచేసి పెద్దవాళ్ల ఆచారములతో నానా అవస్తపడి నేటికి అత్తపెత్తనము చెలాయించే రోజువచ్చేటప్పటికి కోడళ్లకి ఈసుకుమారతనములు సుఖములు ఏమిటనే ఈర్ష్య. ఈమార్పు ఎందుకు రావాలనే కోపముతో లేనిసమస్యలు తెచ్చుకొని తాము బాధపడుతు కోడళ్లను బాధపెడుతుంటారు. కోడళ్లవిషయమా? పుట్టిపెరిగిన స్వస్థలమును మిత్రులను బంధువులను విడిచివచ్చి ఇక్కడ అనుభవించే సుఖమేమిటనే పెద్దసమస్యకుతోడు అత్తలఅథార్టి ఇంట్లోచాకిరి-బావమరదుల అడబిడ్డలబాధ పిల్లలపోరు, ఇరుగు పొరుగులగోల, ఈసంసార సముద్రము ఈదలేక మగనికి ఎదురు చెప్పేశక్తిలేక, పూర్వాచార ప్రకారము అత్తలమీద విరుచుక పడటము మామూలయిపోయింది. ఎవరో నూటికి ఒకరే ఈ సమస్యలులేని అత్తకోడళ్లువుంటారు.

2. మొన్న జరిగిన అఖిలభారత మహిళాసభలలో అధ్యక్షులయిన అనసూయాబాయి కాళెగారు చెప్పేవాటిలో సంతాన నిరోధము విషయము స్త్రీలు ఏమిచెయ్యాలి? అది ఎంతవరకు అవసరము?

జః నేటిబీద భారతీయులకు చాలా అవసరము. కొన్నాళ్లక్రిందట ఇదేవిషయము స్త్రీ అనేపుస్తకములో గుడిపాటి వెంకటచలంగారు కొంతవరకు వ్రాసియున్నారు. కానిచాలమంది స్వార్థపరులు ఆపుస్తకాన్ని అతనిని విమర్శించి చాలా నీచముగా భావించియున్నారు. అలాగు భావించే వారిలో కొందరికంటె చలంగారి కుటుంబము చాల నీతివంతమయినది. ఇటువంటి విషయాలు ప్రతిమహిళ, అన్నిమహిళా సంఘాలు శరీరసంబంధము బాగ తెలిసిన విజ్ఞానులను తెలుసుకొని డబ్బుకోసరము రహస్యముగా పనిచేయుటకాక అవసరమయిన కారణములుగల స్త్రీకి సంతాన నిరోధమునకు సహాయపడునట్లు అందోళన చేయుట మంచిది. నేడు సంఘమునకు ప్రజలకు భయపడి సరియైనమార్గములు తెలియక చాలమంది ఈవిషయమయి బాధపడుచున్నారు. ఎందరు ఈసమస్యలు తీర్చుకోలేక అవస్థ పడుచున్నారో ప్రతిమహిళ ఆలోచించాలి. 1 సరి అయిన ఆరోగ్యము బలము వయస్సు లేనివారికి 2. పెంచడానికితగు ఆస్తిలేని వారికి 3. శరీరములో అంగములు సరిలేనివారికి 4. పిల్లలపెంచను చేతకానివారికి, ఇష్టములేని వారికి, ఇంకా ఇటువంటివే తప్పనిసరికారణములు ఏమయినాఫుంటే ఋజువు పరచు స్త్రీలకు తగుసలహానిచ్చు విజ్ఞానులు కావాలి అని కోరుచున్నాను.

(విలేఖరుల అభిప్రాయములకు పత్రికాసంపాదకులు బాధ్యులుకారు గృ॥ సం॥)

# కస్తూరిబా గ్రామసేవికా శిక్షాశిబిరము

(ఆంధ్రశాఖ—సీతానగరం)





శిక్షాశిబిరం నడుపుతున్న ఉపాధ్యాయినులు.



శిబిరంలో నూలు వడుకుతున్నారు.





వార్ధా విద్యాలయంలో బాల బాలికలు 'డ్రిల్' చేస్తున్నారు.

# కస్తూరిబా గ్రామసేవికా శిక్షాశిబిరము

(ఆంధ్రశాఖ—సీతానగరం)





శిక్షితలు వినోదోత్సవాలు చేస్తున్నారు.



బాలబాలికలు తోటపనికి నీళ్ళు తోడుతున్నారు.





విద్యార్థులు కథలు చెప్పుకుంటున్నారు.

# కస్తూరిబా గ్రామసేవికా శిక్షాశిబిరం

ఆంధ్రశాఖ—గౌతమీ సత్యాగ్రహాశ్రమం - సీతానగరం

శ్రీమాతా కస్తూరిబాగాంధి స్మారకచిహ్నంగా కోటిఇరవైలక్షల రూపాయలకు పైగా వసూలైనది గాంధీమహాత్ముడు అధ్యక్షుడుగా ఏర్పడ్డ ట్రస్టుబోర్డు యాజమాన్యంక్రింద ఆనిధి స్త్రీలకు శిశువులకు విద్యాభివృద్ధికై వినియోగపడవలయును అని నిర్ణయమైనది. ఉడతాభక్తి ఆంధ్రదేశంకూడా 6 లక్షలపై చిలుకు వసూలుచేసినది. ఆ వసూలుకు మూలమైనవారు శ్రీబులుసు సాంబమూర్తి, శ్రీమతి దుర్గాబాయిగార్లు. పిదప శ్రీమతి దుర్గాబాయిగారినే ట్రస్టుయొక్క ఆంధ్రశాఖకు ఏజంటుగా నేర్పరచిరి. శ్రీసాంబమూర్తిగారి సూచనపై ఆంధ్రశాఖ యాజమాన్యమున తూర్పుగోదావరిజిల్లా సీతానగరమున గౌతమీసత్యాగ్రహాశ్రమమందు గ్రామసేవికాశిక్షాశిబిరము సాగుచున్నది. బొబ్బిలిలోను వైద్యోపచారము, మంత్రసానిపనులకు తర్ఫీదునిచ్చు శిబిరమొకటి నడచుచున్నది. సీతానగరమందలి శిక్షాశిబిరము వివరము లిచ్చుకరపత్రమును మాకార్యాలయమున కంపగా కృతజ్ఞతతో స్వీకరించితిమి. అసలిది వార్ధావిద్యావిధానోపాధ్యాయినీవర్గ శిక్షాశిబిరముగా ప్రారంభమైనది. అయితే క్రమముగా దీనికనుబంధములుగా గ్రామసేవికాశిక్షణ, స్వావలంబశిక్షణ, వార్ధావిద్యాలయము మున్నగునవియు సాగుచున్నవి. ఈ ఉద్యమములన్నిటికి గ్రామసేవికాశిక్షణ హెచ్చు బాహుళ్యత కలదగుటచే దీనిని గ్రామసేవికాశిబిరమని పిలుచుచున్నారు.

ఈ శిబిరము సీతానగరం గౌతమీసత్యాగ్రహాశ్రమములో జరుగుచుండుట విలక్షణమైనది. ఆ ఆశ్రమమున కీ॥ శే॥ డాక్టరు సుబ్రహ్మణ్యంగారు కొంతమంది యువకుల సాహాయ్యమున నిర్మాణకార్యక్రమము గావించుచు సత్యాగ్రహసమరమున ఆహుతియైనారు. ఆశ్రమవాసులందరును స్వాతంత్ర్యయుద్ధమున పాల్గొని ముక్కాకల తీరినవారు. 1930 లో ఆశ్రమవాసులగు మిగత పురుషులందరు జైళ్లలోనున్నపుడు ఆశ్రమ సంరక్షణము గావించుచు శ్రీ మామిడి లక్ష్మీపతిగారు ఆశ్రమమందే పాముగరచి చనిపోయిరి. ఆ ఆశ్రమముననుండి యథోచితదేశసేవచేసిన శ్రీమతులు లక్ష్మీనర్సమ్మ (డాక్టరుగారితల్లి) కామేశ్వరమ్మ (డాక్టరుగారిభార్య) మానాప్రగడసుందరమ్మ, మద్దూరి వెంకటరమణమ్మ, వోలేటిసీతమ్మ, వంగవేటి రాజేశ్వరమ్మగార్లు స్వరాజ్యమును కండ్లచూడకయే కీర్తిశేషులైనారు. ఇందు సుందరమ్మ వెంకట రమణమ్మగార్లు ఖైదుకూడ అనుభవించిరి. అట్టిపవిత్రస్థలమున నీ శిబిరముసాగించుట శ్రేయస్కరము. ఇట్టిదేశసేవకుల నిలయమున, వారిని వారి వీరకృత్యములను స్మృతికితెచ్చు ఆశ్రమమున, నేడీశిక్షాశిబిరము సాగుచున్నది. తొలుతగా 7 గురు యువతులు, గాంధీగారి సేవాగ్రామమున (వార్ధా) హిందూస్థానీ తాలిమి సంఘముచే తర్ఫీదుపొందుటకై ఆంధ్రదేశమునుండి 1945 జూన్ లో పంపబడిరి. వీరుసుశిక్షితులై 1946 ఏప్రిల్ లో తిరిగివచ్చిరి. 1946 జూన్ 9 వ తేదిన ఈ శిబిరము సీతానగరమున ప్రారంభమైనది.

ప్రారంభదశలో ఇక్కడ తర్ఫీదుపొందిన ఉపాధ్యాయినులు 8 మంది; తర్ఫీదనందవచ్చిన విద్యార్థినులు 13 గురు. అయితే 130 మంది దరఖాస్తుదారులనుండి 25 మంది ఏర్పరుపబడిరనియు, వారుక్రమముగా 32 కి వృద్ధియైనను 12 మంది మధ్యమధ్య విడిచివెళ్లిరనియు, అందు 3 గురు దుష్ప్రవర్తనకై పంపి

వేయబడిరనియు తెలియుచో ఇచ్చట శిక్షణ ఎంతకఠినతరమో, స్పష్టముకాగలదు. వీరిపేరులు ఊరులు గాంచుచో ఆంధ్రదేశమున దాదాపు అన్నిప్రాంతములనుండియు యువతీమణులీ శిక్షాశిబిరమునకు విచ్చేసినట్లు తెలియగలదు.

జూన్ 1946 నుండి డిశంబరు 1946 వరకు ప్రాథమిక శిక్షణముగిసినది. ఈ ఆరునెలలలో విద్యార్థినులు ముఖ్యముగా వారు అవలంబించిన ఖద్దరు పరిశ్రమద్వారా తమకు కావలసిన వస్త్రమంతా తయారు చేసుకున్నారట.

1947 జనవరినుండి 1947 డిశంబరువరకు వార్ధావిద్యావిధానమున ఉపాధ్యాయినుల తర్ఫీదునడిచినది.

ఇట్లు మొదటి జట్టు తర్ఫీదు అగుచుండగా రెండవజట్టువారు 1947 డిశంబరువరకు ప్రాథమికశిక్ష పొంది పూర్తిచేసిరి.

ఉపాధ్యాయినీ శిక్షాశిబిరముతోపాటు వార్ధావిద్యాలయమున్నూ ఒకటి ఇక్కడ సాగుతున్నది. ఈ పాఠశాలకు చుట్టుప్రక్కల గ్రామాల బాలబాలికలు వస్తున్నారు. ప్రారంభంలో 60 మంది విద్యార్థులు చేరారు. వీరిలో 16 సం॥ ల బాలికలున్నూ ఉన్నారు.

వార్ధావిద్యావిధానము ముఖ్యముగా ఏదేని చేతిపని నాశ్రయించినది; ఇందు పుస్తకాలు మొదలగు పాతపద్ధతి సామగ్రిఉండవు. పెద్దతరగతులవారి నీవిధానము ఆకర్షించలేదు. వారికన్న తక్కువతరగతి వారికి నచ్చినా తలిదండ్రులకు సహాయంచేయవలసిన కాలంలో వారుసరిగా బడికిరారు. ఇతరపద్ధతి బడు లున్నచోట ఈ బడికిరావడంకూడా కష్టమే. ముఖ్యంగా యిలాంటిబళ్లకు వచ్చేవారు కార్మికులబిడ్డలు. వారు ఆయాకాలాల్లో కూలినాలికిపోతారు. అదికాదనడానికివీలులేదు. వారికి సంపాదనకూడా ఇచ్చే విద్య అయినా చెప్పవలె; లేక అర్ధరోజే పాఠశాలనడపవలె. ఇత్యాదివిషయములను - శిబిరనిర్వాహకులు అనుభవంచేత చెప్పుచున్నారు. అయితే ఈ విద్యార్థులు వడికిననూలుచేత నేయించినగుడ్డ (1946 జూన్ మొ. 1947 ఏప్రిల్ వరకు) 112 గ॥ ల గుడ్డ. దీనిఖరీదు రు 230 లు. దీనికైన పెట్టుబడి రు 180 లు మాత్రమే. లాభం రు 50 లు. ఈ నూలువడికిన వారంతా 5-10 సం॥ ల మధ్య బాలబాలికలు.

ప్రథమంలో వార్ధావిద్యావిధానమున ఉపాధ్యాయినీ శిక్షాశిబిరముగా ప్రారంభమైనా - కేవలము ఉపాధ్యాయినిగానేగాక ఆ యువతి గ్రామసేవికగా తయారుకావలసివచ్చెను. 'గ్రామసేవ' అనేసరికి తర్ఫీదు నందవలసిన విషయములుకూడా హెచ్చినవి. ఇందుకుగాను వైద్యవిషయం, రోగులకు ఉపచారవిషయం తర్ఫీదునిచ్చే శిబిరం వక్కటి బొబ్బిలిలో ఈ ట్రస్టుక్రిందనే సాగుతున్నది; ఇక్కడనుంచి విద్యార్థినుల నంప బడుతున్నారు. అంతేగాక ఇక్కడనే గ్రామపారిశుధ్య మిత్యాది శిక్షణాలు ఇవ్వబడుతున్నవి.

ఇంకా ఈ శిబిరంలో విద్యార్థినులకు స్వావలంబన విధానంలోకూడాఅంటే రెండేండ్లలో తమకుతగిన బ్రతుకుతెరువు తామేర్పరచుకోగల శక్తినేర్పరుపవలెనని ఆశ. ఇలాంటివారికి, వడకడం, నేయడం, కుట్టుపని వగైరాలు నేర్పుతున్నారు.

ఈ విధంగా వీరు శిక్షాశిబిరంలో శిక్షణనిస్తూ విద్యార్థినులలో కలిసి గ్రామసేవను గావిస్తు చుట్టుప్రక్కల గ్రామములతో పరిచయం చేసుకొంటున్నారు. వట్టిరోజులలో వయోజనవిద్యావ్యాపకము, పండుగలు ఉత్సవాలరోజులలో ప్రజాసేవ, ప్రజాప్రబోధము గావిస్తున్నారు.

జాతీయోత్సవములలో వీరుముఖ్యముగా అందరుచేరి 'సూత్రయజ్ఞం' (24 గం||లు నూలువడుకుదీక్ష) నడుపుతుంటారు. ఆవిధంగా వడికిననూలుపెట్టి వీరు 70 గ||ల గుడ్డతయారుచేయించి పేదపిల్లలకు పంచిపెట్టినారు.

ఈ శిబిరంలో వంట, తోటపని ఇత్యాదులన్ని వీరేస్వయంగా చేసుకుంటారు, ఇందుకుగాను వీరిలో వీరే ఆయాపనులను నిర్వహించడానికి పెద్దలను ఎన్నుకొని వారిఆజ్ఞానువర్తులై ఆయాపనులలో నడుచుకొంటారు. దీనివల్ల వీరిలో ఐకమత్యం ఏర్పడడం హెచ్చుతగ్గులసేభావం నశించడం జరుగుతున్నది. ఈ శిబిరములో కులమత వివక్షతలేమీ పాటింపబడవు.

ఈ శిక్షాశిబిరం జీవితం ఈ యువతుల మానసికస్థితి పెంపొందడానికెలా తోడ్పడినదో ఈ విషయం తెలుపుతుంది. వీరిక్కడికిరాకముందు వీరిలో కొందరికి ఉద్రేకస్వభావము, తన్మూలము మూర్ఛావస్థలు (హిస్టీరియాఫిట్స్) ఉండేవట. ఈ శిబిరంలో చేతిపనులతోకూడిన విద్యావిధానమున శిక్షణ అమరగానే ఆ వ్యాధులు తొలిగినవట.

ముఖ్యంగా ఈ శిబిరమును మొదటనుంచీ శ్రీమతి డి. యస్, విద్యావతీదేవిగారు బి. ఎ. బి. ఎల్ గారున్నూ, శ్రీమతి దిగుమర్తి బుచ్చికృష్ణమ్మగారున్నూ, సంయుక్త కార్యదర్శినులై నడుపుతున్నారు. ప్రస్తుతం శ్రీ విద్యావతీదేవిగారు, శ్రీమతి దుర్గాబాయిగారిస్థానే ట్రస్టు ఆంధ్రశాఖకు కార్యదర్శినిగాకూడా ఉన్నారు.

ఇక శ్రీ బుచ్చికృష్ణమ్మగారంటే కీ। శే। దిగుమర్తి హనుమంతరావుగారి ధర్మపత్ని. శ్రీ రావుగారు మహాత్ముని ప్రప్రథమ శిష్యులలోనొక్కరు; నెల్లూరు పల్లెపాడు ఆశ్రమస్థాపకులలోను నిర్వాహకులలోను నొక్కరు. అట్టి మహనీయుని సహధర్మచారిణి, బ్రహ్మచారిణియై ధర్మశిక్షితయైన విదుషీమణి.

ఇంకను మరి ఏడ్గురు యువతులు వీరికితోడై శిబిరమున శిక్షణమిస్తున్నారు.

ఇందు 1947 డిశంబరు నాటికి శిక్షణపూర్తిగావించుకొన్న దేశసేవికలు ఆంధ్రరాష్ట్రమంతట వివిధ స్థళాలలో ట్రస్టుయాజమాన్యమున ఏర్పరుపబోయ్యే కేంద్రముల పనిచేస్తారు. రెండవజట్టు 1949 ఏప్రెల్ నాటికి తర్ఫీదు ముగిస్తారు.

ఈ విధముగా నీ శిబిరము దినదినాభివృద్ధి నందుచున్నందులకు మేమెంతయు సంతసిల్లుచున్నాము. స్వావలంబన శిక్షితలకు నేర్పతగిన బ్రతుకుతెరవు లింకను హెచ్చునని ఆశించుచున్నాము. చిరకాల మిట్టి శిబిరము నడిచి ఆంధ్రదేశమున కనీసము గ్రామమునకొక్క గ్రామసేవికనైన సరఫరాచేయుగాక. ఈ విధముగానైన మహాత్ముని ఆశీర్వచనానుసారము స్థాపకులైన డాక్టరు సుబ్రహ్మణ్యంగారి మధురస్మృతి పచ్చగానుండుట ఆంధ్రదేశీయు లందరికి హర్షదాయకము.

—★—

# సామెతలు

శ్రీమతి ఆర్. రాధాదేవిగారు

41. అల్లసాని పెద్దన్నగారి కవిత్వంకొంత సాహిత్యం కొంత.
42. అంగట్లో అన్నీఉన్నా అల్లుడునోట్లో శని.
43. తినగలఅమ్మ తిండి, తీర్థాలలో బైటపడుతుంది.
44. ఇంటిగుట్టు లంకకుచేటు.
45. కాకుల్నికొట్టి గద్దలకు వెయ్యడమెందుకు?
46. మీయింట్లో భోంచేసి మాగుమ్మంలో చెయ్యి కడుక్కో.
47. చింత చచ్చినా పులుసుచావదు.
48. చెట్టులేనివూళ్లో ఆముదపుచెట్టు మహావృక్షం.
49. గేదెలేనివూళ్లో గొడ్డుగేదె శ్రీ మహాలక్ష్మిఅట.
50. పులినిచూచి నక్క వాతపెట్టుకొన్నట్లు.
51. రామాయణమంతా విని రాముడికి సీత ఏమౌతుందన్నారట.
52. కంచే చేనుమేస్తే కాపేమిచేస్తాడు?
53. జరిగితే జ్వరమంత సుఖములేదు.
54. ఇల్లుకట్టిచూడమన్నారు, పెళ్లిచేసిచూడమన్నారు.
55. అప్పుతీర్చి అంగట్లో కాపురముండాలి.
56. తనకుమాలినధర్మం, మొదలు చెడ్డ బేరమూనా?
57. ఎల్లమ్మపెళ్లిలో పుల్లయ్యకోకపోచ.
58. ఇంట్లోపోరు, కంట్లోనలక, కాల్లోముల్లూసమానం.
59. గాదిలోధాన్యం గాదిలోవుండాలి బిడ్డ గారగాయలా వుండాలంటే ఎట్లా?
60. తోచీతోచనమ్మతోటికోడలు పుట్టింటికెళ్లిందిట.
61. అల్లుడుకి నెయ్యిలేదు అతనితోవచ్చినాయనకి నూనెలేదు.
62. అయ్యకు పెళ్లవుతుందన్న సర్దాయేగాని సవతి తల్లి వస్తుందని తెలీదు.
63. సన్యాసిపెళ్లాం విధవాగాదు, పునిస్త్రీగాదు.
64. ఎద్దుగా ఏడాదిబ్రతికేకంటె ఆంబోతుగా ఆర్నెల్లు బ్రతకడం మంచిది.
65. పసుపూబొట్టుకు పదిఆమడవెళ్ళాలి.
66. దేముడు వరమిచ్చినా పూజారి వరమియ్యడు.
67. లంఖనాల్లో మనుగుడుపులట.
68. తల్లి చెవులుకొరికినవాడు పినతల్లికి కమలాలు చేయిస్తాడా?
69. ప్రయాణాలవారి హడావుడికన్న పెట్టెలు మోసేవారి హడావుడి ఎక్కువ.
70. ప్రక్కవాడు పాడి ఆవంటే ఇంటివాడు యీచుకు పోయిందన్నాడుట.
71. నడిమంత్రంసిరి, నరంమీదపుండు.
72. సవతికుండనైనా ఉడుకుతుందిటగాని తోటికోడలికుండని ఉడకదట.
73. వట్టిగొడ్డుకు అర్పులెక్కువ.
74. కాకిపిల్ల కాకికిముద్దు.
75. కొనపోయే గేదె పెట్టపోయే పుచ్చపాదు మేసేసిందట.
76. అందరికినేలోకువ, నాకు నంబికొండయ్యలోకువ.
77. తాడితన్నేవాడి తల తన్నేవాడుంటాడు.
78. అత్తమంచీ వేముతీపీ వుంటుందా?
79. అన్నదమ్ముల్లో ఆఖరివాడికంటె అడవిలో మ్రాకైపుట్టడం మంచిది.
80. ఎద్దుకేమి తెలుస్తుంది అటుకులరుచి?



# మేకపోతు గాంభీర్యం

[సామెతలు రెండువిధాలు. స్వయంసిద్ధమైన అర్థంకలవి ఒకరకం. పూర్తిఅన్వయం తెల్పేకథలుకూడ వెనుకగలవి రెండోరకం. ఈ "మేకపోతుగాంభీర్యం" రెండవ రకానికి చెందినది. దీనికిసంబంధించిన కథ ఇందువ్రాస్తున్నాము. ఇష్టమైనపాఠకులు ఇతరలోకోక్తుల గూర్చి కథలవ్రాసిపంపితే సంతోషపూర్వకంగా ప్రచురిస్తాము. గృ॥ సం॥]

ఒక మేకపోతు బాగాబలిసినది, పెద్దగడ్డంగలది, వెనుకకుతిరిగినకొమ్ములుగలది—అడవిలో ఆచెట్టునా ఈపుట్టనా ఆకులుమేసిమేసి అలిసి—ఒకగుహలోదూరి వాకిట్లో ఒకబండపైకూర్చొని సేదతీర్చుకుంటూ ఉన్నది. ఇంతలో ఆ గుహాయందు అలవాటుగా నివసించుచున్న సింహము తనవిహారముముగించుకొని వచ్చినది. దాని నల్లంతదూరమున చూడగనే మేకపోతునకు గుండెలు జారిపోయినవి. అయినను పైకిధైర్యము వీడక గాంభీర్యముద్రతో-దరిదాపులకువచ్చిన సింగముతో నిట్లుపల్కినది:—



"అహ మేవశతం వ్యాఘ్రం
పంచవింశతి కుంజరాః
ఏకసింహం నభక్ష్యామి
గడ్డం వపన ముచ్యతే॥"

[నేనే సుమా—నూరుపులులను 25 ఏనుగలనుతిని, ఇంకొక్కసింహమునుమాత్రము తిననిదే—ఈగడ్డమును తీసివేయను అని శపథముపట్టినది!]

ఈమాటవినగానే, సింహమునకు జంకుకలిగినదట. పోనీ ఇప్పటికితలదాచుకొని ప్రాణము దక్కించుకొందమని తొలగిపోయినదట. దానితో మేకపోతు చెంగున ఎగిరి — పారిపోయి— 'బ్రతుకుజీవుడా' అని ఇంటికిచేరినదట.

సామాన్యముగా అంతస్సత్వములేకున్నను తనకుమించిన వారెదుర్కొన్నప్పుడు-గాంభీర్యముద్రవహించి పటాటోపమున ప్రగల్భములుకొట్టి తప్పించుకొనగల్గువారిది "మేకపోతుగాంభీర్యము"-అందురు.

# శారద లేఖలు

సౌభాగ్యవతి కల్పలతకు,

నెచ్చెలీ!

నీవు వ్రాసిన లేఖ చేరినది. రాష్ట్రమహిళాసభ చూచివచ్చితివిగదా. అచటి విశేషములు వ్రాసినావు కావేమని వ్రాసితివి. బెజవాడలో రాష్ట్రమహిళాసభ ముగియునప్పటికి మద్రాసులో గృహలక్ష్మి టపాకట్టు సమయము సమీపించెను. కాన జనవరినెలకు పంపవలెనను కొంటిని. ఈలోగా అఖిలభారత మహిళాసభ మద్రాసులో జరుగునను వార్త వినవాయెను. వేడి వేడి వంటకములు తయారైయుండగా చలిదిపదార్థములు భుజింప నాసపడువారుందురా? అందులో స్థానికముగా జరిగెడి అఖిలభారతమహిళాసభ వార్తలకంటె జరిగిపోయిన రాష్ట్రసభవార్తలెట్లు ప్రాముఖ్యత వహింపగలవు. కానవానికి తావిచ్చుటయుక్తము. పిమ్మట మనటపా నడపవచ్చుననుకొంటిని. పైగా పెండ్లి ప్రయాణములును పండుగపేరంటములును మనలేఖల కించుక యవరోధము గలిగించినవి. అయిననేమి? ఆలస్యమైనదేగాని ఆవశ్యకత తీరలేదు. ఎప్పటి కప్పుడు బెజవాడరాష్ట్రమహిళాసభ విశేషములు నీకు తెలుపవలయునని ఆతురపడుచునే యున్నాను.

ఈమారు ఆంధ్రరాష్ట్రమహిళాసభ 1947 సంవత్సరము డిశంబరు 6, 7, తేదీలలో ఆంధ్రదేశమునకు కేంద్రస్థానమైన బెజవాడలోజరిగినది. దాదాపు ఆంధ్రదేశమునందలి యన్నిజిల్లాలనుండియు, ఆంధ్రరాష్ట్రమునకు రాజధానికానున్న మద్రాసునుండియు ప్రతినిధులువచ్చినారు. ఈ మహిళాసభకు అధ్యక్షురాలు శ్రీమతి కొండ పార్వతీదేవి బి. ఏ. గారు. పార్వతీదేవిగారు సుప్రసిద్ధదేశసేవా పరాయణులై దేశభక్తబిరుదుగొన్న కొండ వెంకటప్పయ్య పంతులుగారి అనుంగుపుత్రి; తండ్రియందుగల దేశభక్తి, సేవాసక్తి కార్యదీక్ష, ఆమెయందును తొణికిసలాడుచున్నవి. కావున ఆమెపట్టభద్రురాలు కాగానే పైతృకంబైన సేవారంగములో ప్రవేశించి స్త్రీజనాభ్యుదయ సేవకు తనజీవితమును అంకితము చేసికొనినది. క్రమబద్ధమైన కార్యక్రమము గాని, సరియైన లెక్కపద్దులుగాని లేక చిందర వందరగనున్న రాష్ట్రమహిళాసంఘ కార్యక్రమమును చేతికితీసికొనినది. గతమూడువత్సరములలో ఆమె కార్యదర్శిత్వముక్రింద రాష్ట్రమహిళాసంఘమెంతయో ఉన్నతస్థితికి వచ్చినది. ప్రాథమిక సభ్యురాండ్రసంఖ్య అత్యధికమైనది. గ్రామతాలూకా జిల్లాసంఘము లేర్పడి పనులు జరిపినవి. రాష్ట్రమంతట పెక్కుమార్లు పర్యటించి స్త్రీలలో అవబోధము గలిగించినది. పార్వతీదేవి కార్యకౌశలమును అఖిల భారత మహిళాసంఘమువారు గుర్తించినారు. 1946 సంవత్సరములో స్విట్జర్లాండులో జరిగిన అంతర్జాతీయమహిళాసభకు వెడలు ప్రతినిధులకు నాయకురాలినిగా చేసిపంపినారు.

విదేశపర్యటనముచే పార్వతీదేవిగారి అనుభవము, కార్యదీక్ష ద్విగుణీకృతమైనది, కాన సహజముగ దుర్బలశరీరయు, అనారోగ్యవతియు నయ్యు సంఘసేవచేయుచున్నది.

సభా ప్రారంభకురాలు అమ్మన్నరాజాగారు. స్వాగతసంఘాధ్యక్షురాలు కలగర పిచ్చమ్మగారు. 6-12-47 తేదీ సాయంత్రము అయిదుగంటలకు మహాసభ ఆరంభమైనది. ప్రార్థనాదికములైన తరువాత శ్రీ పిచ్చమ్మగారు ప్రస్తుతస్త్రీల సమస్యలనెల్ల చర్చిస్తూ స్వాగతోపన్యాసము చదివినారు. పిమ్మట సభా

ప్రారంభకురాలు శ్రీమతి అమ్మన్నరాజా గారు ప్రస్తుతదేశపరిస్థితులను స్త్రీల కర్తవ్యమును వివరించుచు సావధానముగను విపులముగను ఉపన్యసించినారు. తరువాత అధ్యక్షురాలు పార్వతీదేవిగారు అఖిలభారత మహిళాసంఘము భారత మహిళాభ్యుదయమున కెట్లు కృషిచేయుచున్నదియు వివరించుచు, దేశము నందన్ని ప్రాంతములను మహిళాసంఘమునందు 30,000 ప్రాథమిక సభ్యురాండ్రుకలరనియు, 41 శాఖలును, 180 ఉపశాఖలును, కృషిచేయుచున్నవనియు తెలిపినారు. మన ఆంధ్రరాష్ట్రములో ఈ మహిళాసంఘము పక్షమున 6000 సభ్యురాండ్రుగలరనియు 10 జిల్లా సంఘములు 30 తాలూకా సంఘములు గలవనియు విశదీకరించినారు. అంతర్జాతీయ మహిళామండలితో మన భారతమహిళాసంఘమునకుగల సంబంధమును, అంతర్జాతీయ వ్యవహారములలో భారతనారీలోకము పాల్గొని చేయుచున్న అఖండకృషియు, ఇంకను భారతమహిళాసంఘము స్వదేశములోను విదేశములోను చేయవలసినపనియు ప్రస్తుత దేశకాలపరిస్థితులలో స్త్రీలు నిర్వహింపవలసిన బాధ్యతలును చక్కగా వివరింపబడినవి మొత్తముమీద పార్వతీదేవిగారి ఉపన్యాసము విషయగర్భితమై యున్నదని తెలిపినజాలును, దాని విలువగుర్తించుటకు ఆమె ప్రతిభ గమనించుటకు.

పూర్వము రాష్ట్రమహిళాసభకు సభకువచ్చినవారెల్లరు ప్రతినిధులుగా యెన్నుకొనబడెడివారు. ఈమారట్లుగాక ఆయాసంఘములలో సభ్యురాండ్ర లెక్కప్రకారము జిల్లాలవారిగా సభకు యెన్నుకొనబడివచ్చిరి. అయినను దాదాపు పదిజిల్లాలనుండి ప్రతినిధులును వారికి ఇనుమిక్కిలిగా ప్రేక్షకురాండ్రును విచ్చేసిరి. విశాలమైన మ్యునిసిపల్ హైస్కూలు ఆవరణములో మాగంటి అన్నపూర్ణదేవిపేరట నిర్మితమైన విశాలమగు పందిరిలో మహిళాసభ సమావేశమైనది. విద్యుద్దీపములు, లౌడుస్పీకర్లు మున్నగువసతులన్నియు చేకూర్చబడినవి. హైస్కూలువేదమీది పెద్ద పెద్ద గదులు జిల్లాలవారిగా ప్రతినిధులకు బసలుగా ఏర్పాటు చేయబడినవి. వందలకొలది సేవికాగణముయొక్క సహాయమేగాక అసంఖ్యాకపురుషులసహాయమును చేకూర్చబడినది.

వివిధమండలములనుండి విచ్చేసిన విదుషీగణముతో సభ కలకలలాడినది. గదులు గలగలలాడినవి. ఆంధ్రనారీమణులట్లు యేడాదికొకమారు కలిసికొని పరస్పర సుఖాలాపములతో గడపు టనునది యొక సుఖమైన అనుభూతి; దివ్యమైన ఆనందము, మధురమైనదృశ్యము. నిజమునకు ఏపెండ్లికందరు విదుషీమణులు సమావేశమగుట సంభవించును? ఆహ్వానసంఘాధ్యక్షక, ప్రారంభక, అధ్యక్షురాండ్ర ఉపన్యాసములతో ప్రథమదినసమావేశము ముగిసినది. నాటిరాత్రిభోజనానంతరము ఖూనీ అను నాటకప్రదర్శనము జరిగినది. ఈనాటకము స్వర్గీయ త్రిపురనేని రామస్వామిచౌదరిగారిచే విరచించబడినది; గుడివాడ సూతాశ్రమ వారిచే ప్రదర్శింపబడినది.

ప్రదర్శనమునకు ముందు వేదమతములోని వైరుధ్యములను వివరిస్తూ ఒకఉపన్యాసము జరిగినది. వసిష్ఠవిశ్వామిత్రులకుజరిగిన వివాదము బ్రాహ్మణ బ్రాహ్మణేతర వివాదగాని ఆత్మబలమునకు పశుబలమునకు జరిగిన పోరాటముగాదని యీ ఉపన్యాసకర్త వివరించారు. పిమ్మట నాటకమారంభమైనది. ఈనాటకములోని కథాంశము భాగవతములోని వేనరాజునకు సంబంధించినది. అయితే వేనరాజును బ్రాహ్మణులైన మహర్షులు శాపదగ్ధుని కావించిరనే విషయము పురస్కరించుకొని యీ నాటకము విరచింపబడినది. కాని భాగవతగాథకును ఈనాటకగాథకును చాలవ్యత్యాసముగలదు. భాగవతములోని వేనరాజు బహుదుర్మార్గుడు. ప్రజాకంటకుడు. వేదమతాచారవిరోధి. ఇతనికి దేవుడులేడు; తానే దేవుడనని యితనివాదన. వేదచోదిత కర్మల నితడామోదింపడు. అకతాయిర్గైన ఈపుత్రుని సన్మార్గమునబెట్ట లేకను, ఏకైకపుత్రుని కఠినముగా శిక్షింపలేకను, ఇతనితండ్రియైన అంగరాజు భార్యాపుత్రులను, రాజ్యమును పరిత్యజించి యెటకోవెడలి పోయినాడు. దేశము అరాజకమైనది. అప్పుడు పెద్దలెల్ల రాలోచించి రాజమహిషి అనుమతిని వేనునకు

పట్టముగట్టినారు. సహజదుర్మార్గప్రవృత్తికి రాజ్యాధిపత్యము తోడుకాగనే వేనుని దౌష్ట్యము మితిమీరి పోయినది. ప్రజలను బహువిధముల హింసింపబూనినాడు. మహర్షులు ఇదితగదని వేనుని కెన్నోవిధముల బోధచేసిరి. అతడువినలేదు. కావున ప్రజాక్షేమమునిమిత్తము మహర్షులితనిని శాపదగ్ధునిచేసినారు.

ఇది భాగవతములోనికథ. కాని నాటకములో యీకథ పూర్తిగా మార్చబడినది. నాటకములోని వేనుడు బహుమంచివాడు. న్యాయశీలుడు. అహింసావ్రతుడు. యజ్ఞపశువుల ఆర్తనాదము వినలేని దయార్ద్రహృదయుడు. హింసాత్మకమైనందుననే యితడు యజ్ఞములనిషేధించినాడు. యజ్ఞములు నిషేధించినందులకు ఆగ్రహముచెందినవారై బ్రాహ్మణులైన మహర్షులు, మద్యమాంసాదులు సేవించువారైన బ్రాహ్మణులు, నీతినియమ విరహితులైన బ్రాహ్మణులు, క్రోధించి, ధర్మాత్ముడైన వేనుని ఖూనీచేసినారు.

దుర్మార్గుడైన వేనుని చంపిన తప్పేమున్నదని లోకము అభిప్రాయపడవచ్చునని కాబోలు నాటకములోని వేనుడు కడు మంచివాడుగ వర్ణింపబడినాడు. కథపొడుగునను వేదధర్మములు, బ్రాహ్మణులు చిత్తము వచ్చినట్లు నిందింపబడినారు.

ఆంధ్రరాష్ట్ర మహిళాసభ ప్రతినిధులవినోదార్థము ప్రదర్శింపబడిన నాటకము ఇది. ఈనాటకమునకును ఆంధ్రరాష్ట్ర మహిళాసభకును ఏమిసంబంధమో తెలియదు. ఇదిప్రస్తుతమునకు సంబంధించినదికాదు. స్త్రీలకు ఉపయుక్తమైనదియు కాదు. స్త్రీలసమస్యలకు చెందినదియు కాదు. ఒకనీతినిగాని ధర్మమునుగాని బోధించునదియు గాదు. పోనిమ్ము; మహిళాసభ గనుక యే బాలికలచేతనైన ప్రదర్శించినారనిన నదియులేదు. పనిగట్టి గుడివాడ సూతాశ్రమమునుండి పిలిపించినపురుషులచే నీ నాటకమును ప్రదర్శింపజేసినారు. ఈనాటకముచూచినమీదట యిది వేనరాజుఖూనీగాదు, బ్రాహ్మణులఖూనీ యనిపించినది. చూచి ఆనందించినవారు కన్పించలేదు. బ్రాహ్మణులైనవారిమనసులు చిన్నబోయినాయి. కాని వారి మనసులు బ్రాహ్మణులయెడ క్రోధోక్తములైనాయి. మహిళాసభలలో ఇట్టి సంఘటన సరికొత్త.

మఱునాడుదయము శ్రీమతి గుడిపూడి యిందుమతీదేవిగారి అధ్యక్ష్యతక్రింద వైజ్ఞానికసభను ప్రారంభించుచు, శ్రీమతి వేదవల్లి తాయారమ్మగారు విజ్ఞానాత్మకమైన చక్కని ఉపన్యాసముచేసినారు. పిమ్మట ఇందుమతీదేవిగారి ఉపన్యాసము జరిగినది. ఇందుమతీదేవి శిష్టాచారసంపత్తిగల విద్వత్కుటుంబమున జన్మించిన కవయిత్రి. చక్కనివాక్చమత్కృతి శ్రావ్యమైనకంఠము ఆమెకు భగవత్ప్రసాదము. ఆమెకు సనాతనాచారములపై అభిమానమెంతయో, దేశభక్తియు నంతగలదు. గాంధీమహాత్మునిపై గాఢగౌరవము. ఖద్దరుపైనెన లేనిప్రేమ. ఇందుమతీదేవిగారి ఉపన్యాసమొకరసధుని; అందులో పాటలు, పద్యములు, శ్లోకములు, పిట్టకథలు అవ్వారిగాదొరలును. హృదయరంజకమైన యేహరికథనో వినుచున్నట్లు శ్రోతలు ఆనందింతురు. ఇందుమతీదేవిగారు వివిధవిషయములపై సుమారు రెండుగంట లుపన్యాసముగావించిరి. తరువాత శ్రీమతి రుక్మిణీలక్ష్మీపతిగారు మద్రాసుశాసనసభలో జరుగుచున్న దేవదాసీబిల్లు, బహుభార్యానిషేధపుబిల్లు, వ్యవసాయభూములలో స్త్రీలకు భాగార్హతనొసగుబిల్లు నాదిగాగలవానిని గుఱించియు మెజారిటీలేనందువల్ల స్త్రీలకుగలుగుచున్న అన్యాయములనుగుఱించియు, పదవులనిచ్చు సందర్భములలో స్త్రీలయెడ చూపబడుచున్న వ్యత్యాసమునుగుఱించియు, దీర్ఘముగనుపన్యసించిరి. పిమ్మట వల్లభనేని సీతామహాలక్ష్మమ్మగారు గూడా మద్రాసుఅసెంబ్లీ విశేషములగూర్చి యుపన్యసింప నారంభించిరి. అప్పటికే పదిరెండుగంటలుదాటి భోజనమునకువెళ్లవలసి వచ్చినందున వారిఉపన్యాసమును నేనువినలేదు.

సాయంత్రము నాలుగంటలకు మహిళాసభ మరలప్రారంభమైనది. జిల్లాకార్యదర్శినుల నివేదికలైన పిమ్మట తీర్మానములారంభించినారు.

భారతావని స్వాతంత్ర్యము బడసినందుకు జోహారులర్పింపబడినవి. అఖండభారతవర్షము రెండుగా ఖండింపబడినందులకు విచారించుచు మరలఐక్యముకావలెనని సూచింపబడినది. సోదరి తుర్లపాటి రాజేశ్వరమ్మ

గారిమృతికి విచారముసూచింపబడినది. వితంతుస్త్రీలకు భాగ్యార్హతగలిగించు 1937-సం॥రపుచట్టము వ్యవసాయ భూములకుగూడా వర్తించుపట్ల గత 10సం॥లకువర్తించునట్లు మదరాసుశాసనసభవారు చేయనందులకు ఆక్షేపణ చేయబడినది. బహుభార్యాత్వనిషేధపుబిల్లుగూడా త్వరలో శాసనముకావలయుననికోరబడినది. ప్రతియూరను స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయము పెట్టుటేగాక సంచారగ్రంథాలయముగూడా పెట్టవలెనని దొరతనమును కోరిరి. అన్నిసంస్థలలో స్త్రీలకు పురుషులతోసమాన ప్రాతినిధ్య మీయవలెననిరి. ఆంధ్రరాష్ట్రమునందు ఒకటి రాయలసీమలోను, ఒకటి ఉత్తరసర్కారులలోను, రెండు స్త్రీకళాశాలలు కావలెననిరి. దేశములో మతకల్లోలములు చెలరేగకుండ స్త్రీలుగూడ కృషిచేయవలెననియు, ఆత్మరక్షణచేసికొనుటకు ప్రభుత్వము వారు శిక్షణకేంద్రము నేర్పరచి స్త్రీలకు శిక్షణనీయవలెననియుకోరిరి. రైళ్లలో స్త్రీలకుగలుగుచున్న అసౌకర్యముల నివారించవలెననిరి. విద్యావతులైన స్త్రీలు విద్యరానివారికి విద్యనేర్పవలెననిరి. సాంఘికవిషయములను ప్రత్యేకశాఖగాతీసి దానికి ప్రత్యేకముగా నొకమంత్రిని నియమింపవలెననియు ఆమంత్రిపదవికి స్త్రీనే నియమింపవలెననియు సూచించిరి. ఆంధ్రరాష్ట్రములో వివిధనామములతో మహిళాసంఘము లేర్పడుచుండుట శోచనీయమనియు దీనివలనసంఘబలము క్షీణించుననియు, ఆంధ్రమహిళలు అట్టి సంస్థలలో చేరక అఖిలభారత మహిళాసంఘమునందేచేరి దానికి చేయూతనీయవలెననియు హెచ్చరించిరి. మహిళాసంఘము పక్షమున బాలికలకు ప్రత్యేకశాఖనేర్పరచి వారిలోవిద్య, లలితకళలు, సంఘసేవ, క్రమశిక్షణ అలవడుటకు ప్రయత్నింపవలెననియు, 'భారత కన్యామండలి' అనుపేరుతో ఈ శాఖను వ్యవహరింపవలయుననియు, ననిరి. ఆంధ్రమహిళాభ్యుదయమునకు అపారకృషిచేసిన శ్రీవీరేశలింగము పంతులుగారి శతవార్షిక జయంతిని, రాబోవు ఏప్రియలు 16-వ తేదీని ఆంధ్రమహిళాసంఘములన్నియు యుత్సాహముతో చేయవలెనని తీర్మానించిరి. కస్తూరిబా నిధిని ఆంధ్రరాష్ట్ర మహిళాసంఘమువారి సలహాపై వినియోగించవలెనని తీర్మానించిరి. ఇంకను నిరక్షరాస్యత నిర్మూలింపవలెననియు లలితకళలను పునరుజ్జీవింపవలెననియు దాదులు మంత్రసానులు ఎక్కువమంది తయారై గ్రామములలో సేవచేయవలెననియు, గ్రామోద్యోగములకు పురుష వారసులు లేనపుడు వారికోమార్తెలను వారసులనుగా చేయవలెననియు, తీర్మానములుగావించిరి. ఈమహిళా సభ రెండుదినములు స్త్రీలుచేయుచున్న ఉపన్యాసములు చర్చలు, పురుషులుగూడ పందిరిచుట్టూ నిలువబడి అత్యంతశ్రద్ధతోవినుట ఆశ్చర్యము గలిగించినది. మనస్త్రీలుగూడ యీమహిళాసభయే మన అక్కరలన్నియు తీర్చగల కల్పవృక్షము అనుకొనినట్టుగా తమకష్టసుఖములన్నియు వివరించిరి. సభ రెండుదినములు జరిగిన తీరునుబట్టియు, చేయబడిన తీర్మానములనుబట్టియు, అధ్యక్షురాలు సభనడుపుటలో జూపిన ఓర్పునేర్పులను బట్టియు సభజయప్రదముగా జరిగినదని చెప్పవచ్చును. దీనికితోడు ఆహ్వానసంఘమువారు ప్రతినిధులకు భోజన భాజనాదుల నమర్చుటలోగూడ సరసముగా ప్రవర్తించినట్లైతే వారిసత్కారం స్తవనీయమై ఉండెడిది. కాని ఈవిషయములో ఆహ్వానసంఘమువారు అవలంబించినవైఖరి ప్రతినిధులకెంతయో మనస్తాపము కలిగించినది.

సాధారణముగా యిటువంటి సభలు జరుగుసందర్భములో శుచిగను, రుచిగను చేయగలరను ఉద్దేశ్యముతోను ఎల్లరు తృప్తికరమైన భోజనము చేయవలయునను నుద్దేశ్యముతోను బ్రాహ్మణులనే వంటవారినిగా నియమించుట ఆచారముగానున్నది. ప్రతివత్సరము జరుగుచున్న రాష్ట్రమహిళా సభలలోనేమి, కాకినాడలో జరిగిన అఖిలభారత మహిళాసభలోనేమి, ఇదియే పద్ధతి అవలంబింపబడినది. ఆహ్వానసంఘమన అతిథిసత్కార సంఘముగదా! ఆతిథ్యములో భోజనమునుమించిన సత్కారమేమున్నది? అతిథులకుసమ్మతమైనరీతిని రుచ్యమైన భోజనముపెట్టినప్పుడే ఆ ఆతిథ్యధర్మము సక్రమముగా నిర్వర్తించినట్లగును. పంక్తిభోజనముల విషయములోకొంత సామరస్యమిటీవల యేర్పడినప్పటికిని కేవలము బ్రాహ్మణేతరులే వంటచేయగా భుజించడమనేది బ్రాహ్మణులకింకను అలవాటుకాలేదు. స్త్రీలలోబొత్తిగనే లేదు. అచ్చటిపదార్థముల రుచిపాకములనుబట్టియు, భోజనప్రదేశమును శుభ్రపఱచుచున్న విధానమును

బట్టియు, వంటచేయువారి వైఖరినిబట్టియు, అచట వంటచేయువారు బ్రాహ్మణులుగారని ప్రతినిధులకు తెలిసి గుసగుసలారంభించిరి. విచారించగా వంటచేయువారు నేతాజీ కమ్మ హోటలువారని తెలిసిపోయినది. ఈసంగతి తెలిసినతరువాత స్త్రీలలో బయలుదేరిన అలజడి యింతయంతగాదు. చాలమంది అక్కడభుజించుటకు మనస్కరింపక ఊరిలో బంధుమిత్రుల గృహములెక్కడున్నవని వెతుకుకొనుచుపోయిరి. కొందఱు, హోటలులో భుజించిరి. మరికొందఱు అరటిపళ్లు కొనుక్కొనితినిరి. ఇంకకొందఱు పస్తులేపడుకొనిరి. అన్నిత్రోసివేసుకొని అచటనే భోజనముచేయపూనినవారుగూడ ఇదేమిభోజనము బాబూ అని మొత్తుకొనిరి. ఆవంటవారు సిగరెట్లు వ్రేళ్లసందున యిరికించుకొని పొగవిడుచుచూ భోజనపదార్థములు ఫలహారపుప్లేటులు అందింపవచ్చినపుడు బ్రాహ్మణ వైశ్యులకుకాకపోయినను తదన్యులకుమాత్రమెట్లురుచించును? అధ్యక్షురాలు పార్వతీదేవిగారు ఎంగిళ్లుపూర్తిగా శుభ్రపరచని ఆప్రదేశములో భుజింపజాలక కిటికీలో అన్నముపెట్టించుకొనితినిరనిన ఇతరుల విషయలో నెట్టి ఆవరము జరిగినదో వ్రాయుటెందులకు?

గతరెండు దినములనుండియు భోజనముల విషయములో ప్రతినిధినులు పడుచున్న కష్టములు, చేయుచున్న పస్తులు చూచిన మీదట పార్వతీదేవిగారికెంతయో మనఃక్లేశముగలిగి రెండవనాటిరాత్రి "ఇదేమిటండీ! యిటువంటి భోజనము లేర్పాటు చేసినారు; బ్రాహ్మణులచేత వంటచేయించెదమని చెప్పియుంటిరే? ఇట్లుచేయించితిరేమి? ప్రతివారు ఇదేమి భోజనమని మొత్తుకోవడమేనే!" అని రత్నమాంబగారి నడిగిరి. అందులకు, "వంటబాగాలేదంటే లేదేమోనని ఒప్పుకుంటాను గాని బ్రాహ్మణులచేత చేయించలేదంటున్నారే? ఆమాటేనాకు అర్థంకావడంలేదు. ప్రస్తుతకాలపరిస్థితులెరిగి ఇట్లా మీరెట్లా అడుగుచున్నారో నాకు అర్థంకావడంలే" దని రత్నమాంబగారు బదులుచెప్పినారు. "ఏమండీ పిచ్చమ్మగారు! మేము బ్రాహ్మణులచేత వంటచేయించెదమని నాతోచెప్పలేదా?" అని మరల పార్వతీదేవిగారు పిచ్చమ్మగారి నడిగినారు. పిచ్చమ్మగారేమియు చెప్పలేకపోయినారు. ఇంతలో మరొకామె "బ్రాహ్మణులచేత వంట చేయించలేదని ఎట్లాఅడుగుతున్నారమ్మా! ఎంతధైర్యంగా అడుగుతున్నారమ్మా! బాగా బ్రాహ్మణులచేత వంటచేయిస్తే తిందామని వచ్చారు కాబోలు, ఆఆటలికసాగ" వన్నది. "ప్రతినిధినులవద్ద మూడేసి రూపాయిలు వసూలుచేశారు; మీరు ఊరికే భోజనము పెట్టలేదమ్మా!" అని మరొకామె జబాబుచెప్పినది. "ఈబ్రాహ్మణులు చచ్చిపోతే బాగా ఉంటుం"దని బి. ఏ. చదివిన వాలంటీరొకామె వాక్రుచ్చినది. "గాంధీగారేమంటున్నారు, అందఱు, ఒకటికావలె ననుటలేదా," అని మఱొకరన్నారు. ఈవాదించువారికి నిజముతెలిసినట్లులేదు. గాంధీగారట్లు చెప్పవచ్చునుగాని నిర్బంధముగాగాని, చెప్పకుండాగాని ఏసంస్కరణనుగాని ఆచరణలోపెట్టుటకు మహాత్ముడామోదించ డనునది సత్యము. ఇట్టిసందర్భములలో మహాత్ముని పేరుచెప్పుట ఆయనను అగౌరవించుటే కాగలదు. ఏసంస్కారమైనను ఐచ్ఛికముగా జరిగినప్పుడే దానికి విలువయు ప్రయోజనమును నుండును. నిర్బంధముగా తినిపించినను చెప్పకుండ తినిపించినను అది సంస్కార మనిపించుకొనజాలదు. అట్లుచేయుట ఆహ్వానసంఘము వారికి యుచితమును కాదు. నాటకప్రదర్శనముతో ఆరంభమైన సత్కారము భోజనములతో నిట్లు ముగిసినది. ఇంతకును బ్రాహ్మణేతరులకు బ్రాహ్మణులపైనున్న ఆగ్రహము జన్మవల్లవచ్చినదిగాని కర్మవల్లవచ్చినదిగాదు. వీరువారితో భోజనభాజనాదులు జరిపినందువల్ల వారు సంతసింతురనుట కల్ల. వారితో భుజింపనివారు నిందింపబడుచుండగా భుజించెడివారు అవహేళన చేయబడుచున్నారు. ఇంతకును మహిళాసభ జాతిమతకులాలకు సంబంధించినదిగాదు. మహిళాసభ సభ్యురాండ్రైనవారు భోజనభాజనాదులలో ఈరీతిగా నడువవలెనను నిబంధనలేదు. మహిళాసభలో వర్ణాశ్రమ ధర్మములలో విశ్వాసముగలవారుగూడ కలరు. వారిని మీశ్రోత్రియత్వమును విడనాడ వలెనని అడుగుటకు ఎవరికి హక్కులేదు. వారివారి యిష్టముల ననుసరించి భోజనాదులమర్చుట ఆతిథ్యమిచ్చు వారిధర్మము మాత్రమగును.

ఈ అలజడి అంతయు ముగిసిన తరువాత కార్యనిర్వాహక వర్గపుయెన్నికలు జరిగినవి. రాష్ట్రకార్యదర్శిపదవికి వావిలికొలను పద్మాసనమ్మగారి నొకరు సూచించగా ఈదుపుగంటి రత్నమాంబగారిని వేరొకరు

ప్రతిపాదించినారు. గతరెండు దినములనుండి కులతత్త్వదేవతాదివ్యరూప సాక్షాత్కారము సహస్రముఖముల అయిన తరువాత పద్మాసనమ్మగారి గెలుపు అసంభవమని బ్రాహ్మణుల విషయములో మేము నూటైదుగురనుమాట రూఢిచేయుదురని తెలిసినప్పటికి ప్రతినిధుల విచక్షణకొఱకు యీప్రతిపాదన చేయబడినది; అనుకొనినట్టుగా రత్నమాంబగారుగెలిచి అభినందన లందుకొనినారు. బ్రాహ్మణులపట్ల అన్నికులములవారు ఒకటైనప్పటికి ఈ మమేకమంతవఱకేగాని పిమ్మట అనేకమే; లేకున్న ఇన్నికులసభలు జరుగుటకు కారణమేమి? నేడు ప్రతివర్ణమువారు తమకులసభల తాము జరుపుకొనుచు తమ కులకవులను సత్కరించుకొనుట తమ పండితుల నాదరించుట తమ కులవిద్యార్థులకు వేతనము లిచ్చుకొనుట తమ కులమునకు ప్రత్యేక ప్రాతినిధ్యము లిమ్మనికోరుట జరుపుచున్నారు. అగ్రజాతులవారుమాత్ర మిట్టి అభిమాన మేమాత్రము చూపరాదని వాదించుచున్నారు.ఇదిఎట్టి ఔచిత్యమో! వారికే తెలియవలయును. మనలో మనమింతకులభేదమును, వర్ణద్వేషమును పెంపొందించుకొనుచు, ఎగువకులములకు ఎగబాకవలయునను నాసయేగాని దిగువకులముల దిక్కు చూడవలయునను తలంపులేక వర్తించుచు, మీకులాభిమానమును మీరువీడ కేలనని ఒకరిని యడుగుటలో ఏమిసబబు గలదో నాకు తోచుటలేదు. భారతదేశానికి వేరుపురుగైనాడని జిన్నానేల నిందించవలయునో అర్థమగుటలేదు. భారతదేశమునకు మతద్వేషము వేరుపురుగై బాధించుచుండిన కులద్వేషము చీడపురుగై పీడించుచున్నది. భాషాద్వేషము గొంగళిపురుగై కొఱికిపెట్టుచున్నది. జీసస్ క్రైస్తు చెప్పినట్టు తమకంటిలో దూలము తొలగించుకొనక ఎదిరికంటిలో నలుసుల వెదకు తత్త్వము మనలో నుండినన్నాళ్లు భరతవర్షమెట్లు బాగుపడును? గురువిందగింజ ఎదుటినలుపునే కాని తనక్రింది మసినెఱుగదన్న సామెతయెరిగినదేగదా. ఎవరుగాని బాహ్యమును చూచినట్లు అంతరమును చూడనేర్చినప్పుడుగాని తమలోపములను తాము గుర్తెరుగజాలరుగదా.

మహిళాసభలు అయిన తరువాత ఊరిలో బంధుమిత్రుల దర్శింప బయలుదేరితిని. ప్రతివారును ఎందులకు వచ్చితివని ప్రశ్నించుటయే. మీ ఊరిలో మహిళాసభ జరుగ మీకు తెలియదా అనిన తెలియదనిరి. అప్పుడు స్వర్గీయ తుర్లపాటి రాజేశ్వరమ్మగారు పురస్త్రీలను కూడగట్టుకొని సమర్థతతో మహిళాసభలు జరిపిన దినములు జ్ఞప్తికి వచ్చెను. సోదరి రత్నమాంబగారికి ఆంధ్రరాష్ట్రకార్యదర్శి పదవితోబాటు అఖిలభారతస్థాయి సంఘసభ్యత్వమును చేకూరినది. కాన ఆంధ్రసోదరీమణుల సహకారముతో స్నేహముతో ఐకమత్యముతో రాష్ట్రీయకార్యముల నెరవేర్చి ఆంధ్రమహిళల కీర్తి ప్రతిష్టలనితోధికము చేయవలయునని నా ఆశ. కల్పలతా! రత్నమాంబగారు అంతటి సామర్థ్యము గలవారే గనుక మన ఆశ సఫలమగునని నమ్మవచ్చును. సెలవు.

ఇట్లు,

మిత్రురాలు

శారద.

(విలేఖరుల అభిప్రాయములకు పత్రికాసంపాదకులు బాధ్యులుగారు. గృ॥ సం॥)

—★—




# బిటా కేఫిన్ (తలనొప్పి బిళ్లలు)

తలనొప్పి, పంటినొప్పి, కాళ్లనొప్పి, నిద్రలేకుండుట, కీళ్ళనొప్పులు మలేరియా, స్త్రీల బహిష్టునొప్పులు, అలసట వగైరా అన్నిటికి గ్యారంటీగా పనిచేయును.

వాడుకొనువిధము పొట్లములోనుండును.

పొట్లం 3 బిళ్ళలు 1 అణా.

# బిటాలాక్సు (చాకలెట్ భేదిబిళ్ళ౦ు)




సు ఖ వి రే చ నౌ ష ధ ము

ఇది చాక్‌లెట్ భేది బిళ్లలు సుఖ విరేచనము కలిగించి మలబద్ధమును పోగొట్టి మంచి జీర్ణశక్తి నిచ్చును

అన్నిచోట్ల దొరకును. పొట్లం 2 బిళ్ళలు 1 అణా.

స్టాకిస్టులు:—దాదా అండ్ కంపెనీ,—పి. టి., మద్రాస్.

తయారుచేయువారు :

**Bombay Tablet Manufacturing Co.,**
**Post Box No. 2092, BOMBAY 2.**

---

## ఆమెకు ప్రేమైకనిధానము

పండిత డి. గోపాలాచార్యులవారి

# అరుణ

గర్భాశయ రోగ నివారిణి

అరుణ స్త్రీలకు వరప్రసాదం వంటిది. ఇది స్త్రీలకు కలిగే ఋతు సంబంధ వ్యాధులన్నిటిని పారద్రోలి జీవనమునకు ఆనందమును, మాధుర్యమును, సౌరభ్యమును చేకూర్చును.

**ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్, మదరాసు 17.**

# లచ్చి సంసారం

శ్రీ సీతారాంగారు

అందాలభరిణెలు అంతఃపురాల్లోనే కాదు చిన్నవూరిగుడిసెల్లోకూడా పుట్తారని నిరూపించేందుకో అన్నట్లు లచ్చి ఓ చిన్న నిరుపేదకుటుంబంలో జన్మించింది. ఆమె చక్కటిచుక్క - మెరుగుపెట్టని వజ్రం. యుక్తవయస్సులోవున్న ఆమెనుచూచి, చూపు మళ్లించుకోవడం ఎంతటివాడికయినా దుస్సాధ్యమయ్యేది. పచ్చటిపసిమి, నవనవలాడే తీరైనఅవయవాలు, విశాలమైనమోము, మురిపించే ఉంగరాలజుట్టు, ముద్దులమూట గట్టేముక్కు, లేతతమలపాకులవంటి పెదవులు, సన్నటి నాజూకైన కనుబొమలు, లేడికళ్లలాటికళ్లు, చూచినవారి నోరూరించేవి. ముక్కునత్తు, చెవికి పెద్దనాగుబాములు, మెడలోపూసలపేర్లు, చేతిని బండగాజులు, నుదుటను పచ్చ, దానిపై పెద్దకుంకంబొట్టు, పెద్దకొప్పు, కొప్పుపై పెద్దబంతిపూలచెండు, ఒయ్యారమయిన నడుము, నగ్నవక్షోజాలు ఒకవైపునుంచి తమఅందాన్ని ఒరగబోసేటట్లుగా వేసిన వల్లెవాటు ద్రావిడ శిలాశిల్పాల్ని స్ఫురణకుతెచ్చేవి.

లచ్చికి యుక్తవయస్సు సమీపించినప్పటినుంచీ ఆమెతల్లి భర్తను వేధించుకుతినడం ఆరంభించింది. పిల్లపెద్దదవుతోంది, ఏదోసంబంధంచూచి ముడిపెట్టివెయ్యమని. ఎదిగినపిల్ల యింట్లోవున్నబరువు ఆడదానికి తెలిసినంతబాగా మొగాడికి తెలియకపోవడంమూలాన కొన్నాళ్లు లచ్చితండ్రి అశ్రద్ధచేశాడుకాని రానురాను ఇరుగూపొరుగూ ఏమనుకుంటారోననే భయంతోటీ, పెళ్లాంపోరుపడలేక శ్రద్ధతీసుకుని దగ్గరవూళ్లు నాలుగూ గాలించి చివరికి ఒక సంబంధం కుదిర్చాడు.

రామిగాడంటే ఇరుగూపొరుగూ అతిప్రేమగావుండేవారు. ఎవరింట్లో ఏకష్టంవచ్చినా తనకష్టంలాగే భావించుకుని పడచాకిరీచేసేవాడు. ఈసంబంధంరాగానే ఇరుగూపొరుగూ, ఆపిల్లనిచేసుకోమని రామిగాడికి సలహాయిచ్చారు. రామిగాడికికూడా, కొన్నాళ్లనుంచీ, వయసురావడంమూలాన గాబోలు, తనకు తెలియకుండానే, చూపు ఆడవాళ్లమీదికి మళ్లుతోంది — లచ్చిచాలా అందంగావుంది; ఎందుకీసంబంధానికి అడ్డు చెప్పాలి?

లచ్చి పెళ్లయింది. వధూవరుల్నిచూచి ఆ గుడిసెల్లోజనం చాలాసంతోషించారు. అమ్మలక్కలు, "ఏముసలిమొగుడో కాకుండా చిన్నవాడు, చక్కటివాడు బుద్ధిమంతుడు దొరికాడు, దానికేంలే హాయిగా బ్రతుకుతుం"దన్నారు. కొందరు వయసుపిల్లలు అతను నల్లగావుంటాడని ఆక్షేపిస్తే ప్రౌఢలు, నల్లగావుంటే ఏమమ్మా మొహంలో కళవుంది, ఎంతబాగుంటాడమ్మా! ఒడ్డూపొడుగూ, కండలుతిరిగినఒళ్లూ, ఆకీవైననడక అన్నారు.

పెళ్లి అయిన కొద్దిరోజులికి లచ్చి కాపరానికివచ్చింది. లచ్చీ రామిగాడు చిలకాగోరింకలలా వుండేవారు.

# లచ్చి సంసారం

గృహలక్ష్మి

లచ్చికి అత్తవారింటికి వచ్చింది మొదలూ సంసారబాధ్యత నెత్తిన పడింది. ఇంట్లో తన మొగుడికీ వేరుదిక్కులేదు, అతని తల్లీతండ్రీ కొద్దిసంవత్సరాలక్రితమే గతించారు. అతను ఒకచిన్న బియ్యంమిల్లులో కూలిపనిచేసేవాడు. రోజుకి తొమ్మిదిఅణాలు యిచ్చేవారు. అదేవారిద్దరికీ హాయిగా సరిపోయేది. ఏరోజు డబ్బులు ఆరోజు తెచ్చుకుంటూ చీకూచింతా లేకుండా కాలంగడిపేవారు.

ప్రొద్దుటనే బయలుదేరివెళ్లి మిల్లులో పనిచేసి ప్రొద్దుగ్రుంకినతర్వాత యింటికివచ్చేవాడు రామిగాడు. లచ్చి అంబలి తయారుచేసి మధ్యాహ్నంతనే మిల్లుకి పట్టుకువెళ్లేది. అక్కడ కూలివాళ్లంతా ఆమెను పలకరించేవారు; కొందరు దీవించేవారు; కొందరు వోరచూపులు చూచేవారు; కొందరు 'ఎకసెక్కా' లాడేవారు. కొందరు కావాలని రాచుకుంటూ పోయేవాళ్లు. కొత్తలో లచ్చి చాలా చికాకుపడింది. ఇంటికివచ్చాక ఒకరోజు పట్టలేక మొగుడికి యీ విషయంచెప్పింది.

"పోవోస్, నీకేందే? వాళ్లకది అలవాటు; నిన్నుకాదనుకోయ్" అన్నాడు బుగ్గగిల్లుతూ గంపెడు ప్రేమతో కౌగిలిలోకి లాగుకుంటూ; లచ్చి పొంగిపోయింది. వీళ్లప్రేమకు అంతులేదు, ఆడంబరంలేదు. వీరిప్రేమలో లిప్‌స్టిక్‌లు లేవు, పౌడర్లులేవు, కార్లులేవు, రైళ్లులేవు, నదులలో చిన్నపడవలమీద విహారింపులు లేవు. తొణికిసలాడని నిండుప్రేమ వారిది. అయినా, నదీసాగరసంగమంలో ఏర్పడే మృదుగంభీరమయిన హోరుమాదిరి, ఆకాశానమబ్బులు హత్తుకున్నప్పుడుకల్గే గర్జరధ్వనిమాదిరి వారిప్రేమ అప్రయత్నంగా వెలికి తెలిసేది.

ఇలా సంవత్సరాలు గడిచాయి, ప్రశాంతంగా, ఆనందంగా, నిముషాలలాగ. ఇద్దరుమగపిల్లలు పుట్టారు లచ్చికి.

ఇప్పుడు రామిగాడి రోజుకూలి తొమ్మిదణాలు చాలడంలేదు. ఇంతలో యుద్ధంకూడావచ్చిపడింది. రానురాను ప్రతివస్తువుకీ ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. లచ్చి చెవులవీ, ముక్కువీ అమ్ముకుతిన్నారు కొన్నాళ్లు. పిల్లలిద్దరికీమాత్రం తిండిపెట్టి పస్తున్నారు కొన్నాళ్లు.

లచ్చికిపాపం అంతవరకూకష్టాలు తెలియవు. పుట్టిపెట్టింది పేదకుటుంబాలలోనే అయినా, అన్నాళ్లూ ఒకవెన్నెలరాత్రిలా గడిచిపోయాయి. తనతల్లినీ తండ్రినీ సాయం అడుగుదామంటే వారుమాత్రం వేరే పరిస్థితిలో ఎలావుండగలరు?

రామిగాడు మిల్లులోసరిగ్గా పనిచెయ్యలేకపోతున్నాడు. పస్తుండిఎన్నాళ్లు బండపనులుచేయగలడు? శరీరం శుష్కింప నారంభించింది. కళ్లుగుంటలుపడ్డాయి. ఒకవారంరోజుల్లో లచ్చికి రామిగాడికి యిరవై ఏళ్లొచ్చి మీదపడినట్లయింది. లచ్చి సమయానికి గర్భంకూడదాల్చింది.

లచ్చి యిదివరకెక్కడా కూలిచేసిఎరగదు. మొగుడితో అంది, ఒకరాత్రి: తనుకూడా ఎవరింట్లోనయినా పనికి కుదురుకుంటానని. "ఊఁ" అన్నాడు రామిగాడు, ఏదోచేయరాని అమానుష కార్యం చేస్తున్నట్లు గుడ్లనీరు గుడ్లను కుక్కుకుంటూ. లచ్చి దగ్గరకువచ్చి తనచిరిగినచీర చాలీచాలనికొంగు చేతితో పుచ్చుకొని రామిగాడికళ్లనీళ్లుతుడిచింది. రామిగాడు చిన్నపిల్లవాడిలాగా ఒక్కపెట్టున బావురుమనిఏడ్చాడు. స్త్రీకి సహజమయిన ధైర్యంతో లచ్చి తల్లిలాగా తనభర్తను దగ్గరకుతీసుకుని అతనిశిరస్సుని తనహృదయానికి హత్తుకుని కురులు సవరించుతూ ధైర్యంచెప్పింది - ఏం? ఇరుగూపొరుగూ ఇళ్లల్లో ఆడవాళ్లు కూలికివెళ్లడం

లేదూ? తనతల్లిమాత్రం కూలిచేసుకోవడంలా? ఇన్నాళ్లుతను ఇంట్లోనేకూర్చున్నదంటే అది తన అదృష్టం తనకు మంచిమొగుడుకాబట్టి తను అంతవరకూ ఎక్కడికీపనికి వెళ్లవలసిన అవసరంలేకపోయింది. రోజూ లెప్పుడూ ఒకమాదిరివుంటాయా? కష్టాలొస్తాయి; సుఖాలొస్తాయి. ఆలోచనలేకుండా సుఖపడినప్పుడు కష్టపడాల్సివచ్చినప్పుడు యింతఆలోచనా, దిగులూఎందుకు? ఇంతకూ తనుపనిలోకి వెడతానంటే అందులో పెద్దచేయరానిపనేముంది?

రామిగాడు తనకామాదిరి భార్యదొరికినందుకు ఎంతో ఆనందపడ్డాడు. లచ్చిచెప్పినమాటలికి అతి సంతోషంకలిగి అతనికికళ్లవెంట జొటజొట నీళ్లుకారినాయి. భగవంతుడికి వెయ్యినమస్కారాలుచేశాడు తనకామాదిరిభార్య వచ్చినందుకు రామిగాడు. వీరిదాంపత్యాన్నిచూచిమురిసి తన సంతోషాన్ని తెల్పుతూ, అప్పుడే వుదయించిన చంద్రుడు తన చల్లటికిరణాల్ని గుడిసె గుమ్మంలోనుంచి ఆ దంపతులమీద, విచార మెరుగక హాయిగా నిద్రించేవారిద్దరి పిల్లలమీదా ప్రసరింపజేశాడు.

లచ్చి ఆవూరుపెద్ద సాహుకారుగారింట్లో పనికి కుదురుకుంది. నెలకి నాలుగురూపాయలుజీతం. రోజూ కోడికూయగానే బయలుదేరి పదిగంటలకు యింటికివచ్చేది. ఈలోగా పిల్లలులేచి ఆడుకుంటూ వుండేవాళ్లు. లేచేటప్పటికి యింట్లో ఎవరూలేకపోయినా పిల్లలు పెద్దకుటుంబాలలోలాగా ఏడ్చేవారుకారు. ఓదార్చేవారుంటేగా ఏడ్వడం! మధ్యాహ్నం యథాప్రకారంగా మొగుడికి అంబలితీసుకువెళ్లేది. మళ్లీ సాయంత్రం ఏ నాలుగుగంటలకో బయలుదేరి, దీపాలు పెట్టినతర్వాత తిరిగియింటికి చేరుకునేది.

కొత్తలో సాహుకారుగారింటికి తెల్లవారగట్ల వెళ్లడానికి లచ్చి చికాకుపడేది. ప్రొద్దుటనే అక్కడికి వెళ్లగనే సాహుకారుగారి జట్కాసాహెబు - వాడెప్పుడుచూచినా షావుకారుగారింట్లోనేవుండేవాడు, పెళ్లాంపిల్లలులేరు కాబోలు - తనని వేళాకోళాలాడుతూవుండేవాడు. పాలేళ్లుకన్నెగరేస్తూవుండేవాళ్లు. వీళ్లిలాచేస్తున్నారని అమ్మగారికి చెప్పేందుకు ధైర్యంచాలదు. అమ్మగారుమంచిదే. చెప్పితే వాళ్లనికేకలు వేయవచ్చు - అయినాచెప్పడంఎలా? పోనీ భర్తతో చెప్పుదామనుకుంటే పనిలోకే వెళ్లవద్దంటాడేమో! అమ్మో! పనిమానివేస్తే యింకేమయినావుందా? కొంపకూలిపోదూ? ఏంచేస్తుంది, పాపం! మిల్లులో కూలివాళ్లని నిర్లక్ష్యంగాచూచినట్లే వీళ్లనీ నిర్లక్ష్యంగాచూచింది. కాని ఒకనాడు ఒకపాలేరు లచ్చిని చీకటిపడినతర్వాత గొడ్లదొడ్డిలో ఒంటరిగాచూచి చప్పుడులేకుండా వెనకనుంచివెళ్లి చల్లగా మీదచెయ్యి వేశాడు. ఛటుక్కున వెనుకకుతిరిగి పేడచేతితో ఫెడేలున లెంపపగిలేటట్టువేసింది. లచ్చి అంతటి మొండి ఘటం అనుకోలేదు ఆ పాలేరు. ఆ రోజుమొదలు మళ్లీవాడు ఆమెజోలికిపోలేదు. కాని ఆమెను చూచి నప్పుడల్లా కళ్లల్లో నిప్పులు గ్రక్కుతూవుండేవాడు.

లచ్చితెచ్చిన నాలుగురూపాయలు, రామిగాడుతెచ్చిన రోజుకూలితో, అన్నివస్తువుల ధరలు పెరిగి పోయినందున, పిల్లలికిమాత్రంపెట్టూ, తాముచున్నపూటతిని లేనిపూట మాని కొన్నాళ్లుగడిపారు. లచ్చికి రానురాను తనగృహపరిస్థితి అతిదుర్భరంగావుంది.

లచ్చికి నెలలువస్తున్నాయి; 5, 6, 7, 8. లచ్చితో బాటుసాహుకారు గారిభార్యకుకూడా నెలలు వస్తూనేవున్నాయికాని ఆమెజీవితంలో ఒడుదుడుకులులేవు. ఆమె స్వయంగా శరీరకృషిచేసి ఒకరిని పోషించనక్కరలేదు. ఆమె అనుభవిస్తున్న సౌఖ్యాన్ని, ఆమెనుగురించి యింటిలోవారు యావన్మందీ

తీసుకుంటున్న శ్రద్ధనూ నిత్యం చూస్తూవున్నా లచ్చి ఏనాడూ ఆమెఅంటే అసూయచెందడంగాని, తనను భగవంతుడు దరిద్రపుకొంపలో పడవేశాడని నిందించుకోవడంగాని, చేసిఎరుగదు. తన సంసారమే తన ప్రపంచం. తన కష్టసుఖాలు తనకు సంబంధించినవి. తను వేదాంతి కాదు. అయినా తనకుతెలిసినదొక్కటే విషయం. తన సంసారపుకష్టాలు తనుతీర్చుకోవాలిగాని యితరులుతీర్చరు. నెత్తురును ఓడ్చిఅయినా తన సంసారాన్ని తను పోషించుకుంటుందిగాని యితరులు సుఖిస్తున్నారని పదేపదే తలచుకుని తన దుఃఖాన్ని యినుమడింపజేసుకోదు.

వానాకాలం దగ్గిరపడింది. ఇంటిమీద ఆకులెన్నోలేవు. కట్టుకునేందుకు గుడ్డలులేవు. తినేందుకు గింజలుదొరకడంలేదు. ఏమూలచూచినా, ఎక్కడవినినా ఆర్తనాదాలే, తిండిలేదనిగోలే - బియ్యంకాదు, నూకలుకాదు, జొన్నలుకాదు, రాగులుకాదు చివరికి వులవలుకూడా దొరకడంలేదు. అధమం ఏవయినా దొరుకుతాయంటే శేరొకరూపాయి. అంతడబ్బు ఎక్కడనుంచి తేవడం?

లచ్చికి తొమ్మిదోనెల - పరిస్థితులు మరీఘోరంగా తయారయినాయి. ఇప్పుడు లచ్చిదృష్టి షాహుకారుగారియింట్లోవున్న వస్తుసముదాయంపై పడసారంభించింది. వారింట్లోకరువులేదు. కొట్లలో బియ్యపు బస్తాలువేలకివేలు నిలవవేసివున్నాయి. బట్టలుతానులకుతానులేమూల్గుతున్నాయి. వారింట్లో అన్నివస్తువులూ, వుపయోగం మాలి మూలలపడివుండటం, తన సంసారాలబోటి సంసారాలు అసంఖ్యాకాలు, మలమలమాడిపోవడం ఎందుకు జరుగుతోందో, దానికి ఎవరు కారకులో ఆమెకు తెలియదు. ఆమె తెలుసుకోవాలని ప్రయత్నించలేదు. తెలుసుకోవాలని ఊహకూడా కలుగలేదు ఆమెకు. ఏవిధంగానయినా తన పిల్లలకింత తిండిపెట్టాలి. అందుకు కావలసిన నాలుగుగింజలు తనుసేకరించాలి. అవి ఏవిధంగాసేకరించాలి అన్నదే ఆమె లక్ష్యం. తనలక్ష్యసిద్ధికోసం ఆమె వక్రమార్గాలు అనుసరించలేదు. నిర్లక్ష్యంగా విరజిమ్మబడివున్న ఆవస్తువులలో తనకు కావలసిన కొంచెముపాటి ఆమె దొంగిలించితే ఎవరూతెలుసుకోలేరు. కాని ఆపని ఆమెచేయలేదు. అయితే పరిస్థితులు విషమించినకొలదీ ఆమె యాచించడంలో అంతతప్పులేదని ఒక నిర్ణయానికివచ్చింది. ఒకరోజు వంచినతలతో షాహుకారుగారిభార్యకు తన కష్టాలుచెప్పుకుని కాసినిబియ్యం యివ్వమనివేడుకుంది. అడగగానే ఆవిడదయతో కొంచెంబియ్యంయిచ్చింది. అవి ఆరోజుకు సరిపోయాయి. మళ్లీవెంటనే యాచించడానికి మనసొప్పలేదు. ఒకరోజు తాళి మళ్లీ అడిగింది. అమ్మగారు మరికొంచెం బియ్యంయిచ్చారు - ఈ విధంగా తన దరిద్రం ఏనాటికితీరుతుంది? కాని ఆమె అంతదూరం ఆలోచించుకొనేటంతటి విజ్ఞానంకలిగియుండలేదు. ఆపూట తనకష్టం ఏవిధంగాతీరుతుంది అని విచారించుకోగలదుగాని అంతకుమించి విచారించుకోగలశక్తి ఆమెకే కాదు ఆమెతరగతికేలేదు.

మొదటిరెండుసార్లు అభిమానంతోనేయాచించింది. కాని ఆ అభిమానంకూడా దరిద్రదేవతా కటాక్షంవల్ల ఆమెను వీడసాగింది - తన యాచనఫలితంగా షాహుకారుగారింటినుండి ఆమె మొదటబియ్యం, తర్వాత నూకలు అటుపైన గంజినీళ్లు సంపాదించింది. కొన్నాళ్లకి ఆగంజినీళ్లు పోయడానికికూడా చీదరించుకునేస్థితిలోకివచ్చింది.

లచ్చికి పదోనెలవచ్చింది. సంసారస్థితి బాగుపడడానికి అవకాశాలు ఏమీకన్పించలేదు. పిల్లలు శల్యాలయినారు. ఒకరోజు తన అభిమానాన్ని నీతిని చంపుకుని షాహుకారుగారింట్లో కాసినిబియ్యం దొంగిలించింది. ఒకపూటగడిచింది.

(సశేషము)

# గృహలక్ష్మికి పద్యరత్నాలు

కల్లూరు అహోబలరావు

భారత రామాయణముల
సారంబును బాగఁదెలియఁ జదువగవలయుఙ్
నోరూర పద్యరత్నము
లారసి నేర్వంగ, మంచిదౌ; గృహలక్ష్మీ!

పోతన భాగవతంబున
నీతికథలనెన్నియేని నింపెనువానిఙ్
చాతుర్యంబునఁ దెలిసినే
నాతులలోఁ గీర్తికల్గు; నయ గృహలక్ష్మీ!

పతిభక్తి వన్నెకెక్కిన
సతులకథఁ జదువవలయు; సావిత్రియు, దా
పతి, చంద్రమతియు, సీతయు
మతివతులై కీర్తిఁగొనిరి; మాగృహలక్ష్మీ!

నాయకురాలును, లక్ష్మి
బాయియు, సంయుక్తవంటి భామామణులుఙ్
వేయిడుమలఁ బడినారలు
ఆయాచరితములఁ చదువుమా గృహలక్ష్మీ!

ఇక్కాలంబున వనితలు
చక్కనివిద్యలనునేర్చి సాహసపరులై
ఎక్కువగ జన్మభూమిని
మక్కువతో గొల్చువారు మా గృహలక్ష్మీ! (సశేషము)




# తల వెంట్రుకలను పెంచును



రీటా కుదుళ్లకు బలమునిచ్చి, నిగనిగలాడు నిడుపాటి వెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్.

తలవెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేను కొరుకు, ఇంకను తలవెంట్రుకలకు సంబంధించిన సమస్త వ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేనవేలు వాడి గుణమును పొందియున్నారు. మీరుకూడ నేటినుండియే రీటా వాడుడు. రీటా హిందూదేశమంతటా దొరకును.

వెల సీసా 15 అణాలు.

# RITA

**HAIR TONIC**



# క్షయరోగమునకు గ్యారంటీ చికిత్స!

(వేనకు వేలు మృత్యుముఖమునుండి బైటపడిరి.) — 20 రోజులకు సరిపోవు మందు రూ 20-0-0



ముందున్న స్థితి

"భస్మము సేవించి నందున జ్వరముతగ్గినది. గుండె బాగుపడినది. తూకము హెచ్చినది. మామూలు ఆరోగ్యస్థితి ఏర్పడినది.

బి. వి. బలిగ
మైసూరు.

వివరములకు:

డాక్టరు:
ఎ.సి. రాజకన్నప్పన్



తర్వాత స్థితి

## (Son of) దేవి పండిట్ ఎ. సి. కన్నప్ప మొదలియార్

క్షయరోగ వైద్యశాల:—3. ఎ. మొడవాకం టాంక్ రోడ్డు, (కెల్లీస్ బస్సుస్టాండు దగ్గర)
కీల్పాక్ పోస్టు: మద్రాసు.

## :జండూ బాలామృతం:




క్షీణించి అనారోగ్య వంతులుగ నుండు బిడ్డలకు అమృతము.
సీసా 1-కి రు 1-1-0.
జండూవారి ఏజంట్లయొద్ద దొరుకును.

## మిత్రాంజనము
[రిజిస్టర్డు]




అన్ని మందుషాపులలోను దొరకును

ఏజంట్లు కావలయును

మిత్రఫార్మసీ [రిజిస్టర్డు]

తెనాలి. M & S.M.Ry

# శ్రీ వీరేశలింగ శతవార్షిక వర్ధంతి

అభినవాంధ్రజాతి నిర్మాతయైన శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు పుట్టి ఈ 16-4-48 నాటికి 100 సం॥లు నిండుతవి. కాన ఆరోజున ఆయన శతవార్షికోత్సవం. అందుచే ఆ రోజున వైభవంగా దానిని జరుపను ఆంధ్రదేశంలో వివిధ ప్రాంతాలలో ప్రయత్నాలు జరుగుతున్నవి. ముఖ్యంగా మద్రాసులో ప్రధాన న్యాయమూర్తి ప్రభృతులగు ప్రముఖులతోచేరిన యొక కమిటీఏర్పడి పని జరుపుతున్నారు. వారందుకు చందాలుకోరుతూ యొకప్రకటనము మాపత్రికకుపంపినారు. దానికందరూ సహాయంచేయ వలసిందే. రాజమండ్రిలోను పలుపురుప్రముఖులు ఈవార్షికోత్సవంజరుపనుపూనుకున్నారు.

నిజానికిట్టి మహనీయుని శతవార్షికోత్సవం ఆంధ్రదేశంలో ఇంటింటా చేయదగ్గది. మేమున్నూ, ఈ ఏప్రిల్ "గృహలక్ష్మి" సంచికను శ్రీ వీరేశలింగ శతవార్షికోత్సవ సంచికగా ప్రచురింపనున్నాము. శ్రీ వీరేశలింగంగారాశించినట్లుగా సంఘసంస్కరణ పరాయణులై - అట్టి కార్యము లాచరించినవారి చరిత్రలు, ఫోటోలు పంపగోరెదము. శ్రీ పంతులుగారితో సాహచర్యము, పరిచయంగలవారు ఆ వివరాలను క్లుప్తంగా వ్రాసి పంపితే కృతజ్ఞతతో ప్రచురిస్తాము.—గృ॥ సం.



రాజమహేంద్రవరంలో గౌతమీనదియందు నిక్షేపించడానికని గాంధీఅస్తికలస్తూపాలుగొంపోవు చున్నారు. శ్రీమతి కాచీపట వెంకటరమణమ్మగారు స్త్రీలకు ముందై నడుచుచున్నారు.



# మహిళాభ్యుదయము

●

శ్రీమతి యనమండ్ర సూర్యకాంతంగారు

●

కేవలం గౌరవార్థము నిర్భయంగా ప్రజాసేవ చేసి ప్రజాగౌరవంగడించిన వనితామణులలో శ్రీమతి యనమండ్ర సూర్యకాంతంగారు ఒకరు.

ఈమెజనకులు కీ. శే. వెంపటి సూర్యనారాయణ గారు; జనయిత్రి శ్రీసుభద్రమ్మగారు. శ్రీమతి సూర్యకాంతంగారు 1922సంవత్సరమున జనించి, జన్మస్థానమైన శ్రీకాకుళములో మ్యునిసిపలు బడిలో చదివి ప్రస్తుతం విశాఖపట్టణం కోఆపరేటివు బ్యాంకిలో మ్యానేజరుగా పనిచేసే శ్రీయనమండ్ర సోమేశ్వరరావుగారిని 11 వ సంవత్సరమున వివాహమాడి, స్కూలుఫైనలుపరీక్షలో నెగ్గి, ఇంటరుమీడియేటు చదివి, దారుణమైన టైఫాయిడు జ్వరాఘాతంచేత విద్యాప్రయత్నం విరమంచారు.

విద్య విరమించినా, విద్యమీద ఆసక్తి ప్రజాసేవచెయ్యమని ప్రోత్సహించుటచేత, ఈమె 1-11-1944 తేదీని ఫస్టుక్లాసు బెంచీలో గౌరవమేజిస్ట్రేటుగా ప్రవేశించారు. తరువాత, వర్తకుల దారుణ ధనతృష్ణను అరికట్టాలని గవర్నమెంటు ఏర్పరచిన జిల్లాసలహా సంఘములో సభ్యులయ్యారు. ఈమె కార్యదీక్ష, కార్యదక్షత దీపించుటచేత, విశాఖపట్టణం రేషనింగు కార్యవర్గంలో పనిచెయ్యాలని ప్రభుత్వం నియోగించారు. కష్టపడి నిశ్చలంగా పనిచేసేవారికీ, కష్టపడకుండా అధికారపదవులు అలంకరించేవారికీ సరిపడదు. ఐనా, ఈ వీరవనిత కష్టనిష్ఠురాలు సహించి ఆయాపనులు జయప్రదంగా నిర్వహించారు. స్త్రీలకోసం ఏర్పడిన కుటీరపరిశ్రమల సహకార సంఘానికి సహాయకార్యదర్శిగాకూడా పనిచేస్తున్నారు.

యుద్ధకారణోద్భూతమైన కార్యకలాపాలు శ్లాఘనీయంగా నిర్వర్తించడమే కాకుండా, ఆంధ్రమహిళా సంఘానికి కార్యదర్శినిగాను, వుమన్స్ ఇండియన్ ఎసోసియేషనుకు కార్యదర్శినిగాను కూడా పనిచేశారు.

ఏవ్యవస్థలో పనిచేసినా, అసూయా విరోధభావాలతో విఘాతాలు కల్పించే కోటిచాంద్రకు అణుమాత్రమూ జంకకుండా ఏకాశయబద్ధయై కృతకృత్యురాలు కావడమే ఈ విదుషీమణి లక్షణం.

—★—




1948 ఫిబ్రవరి

,, 9 ,, అస్సెంబ్లీ (ఢిల్లీ)లో పటేలు జయ్‌పాలి మర్ దాడులందు పఠాణులు 7 గురు స్త్రీలను, ఒకశిశువును చంపినారనియు, 2 స్త్రీలను గాయపరచినారనియు చెప్పినారు.

,, 9 ,, మద్రాసునందలి ముసల్మాన్ స్త్రీలు సమావేశమై మహాత్మగాంధీ మరణమునకు సంతాపమును వెలిబుచ్చినారు.

,, 10 ,, ఈనాటి హిందూ పత్రికలో వార్త: ప్రపంచంలోకెల్లా ప్రఖ్యాతి వహించిన ఆర్థిక శాస్త్రవేత్త, జర్మనీ రీచ్ బ్యాంక్‌కు పూర్వాధ్యక్షుడు, హిట్లర్ రాజ్యంలో ఆర్థికమంత్రివర్గ ముఖ్యుడు అయిన వాని భార్య తన శిశువులిద్దరితో మనుష్యసంచారానికి మైళ్లదూరంలో, ఏకాకిగా, కలపతో కట్టబడ్డ గదిలో కాలం గడుపుతున్నది.

,, 11 ,, మద్రాసు నందలి విద్యోదయ బాలికా గురుకులము నందు గాంధీ శ్రాద్ధమును, ఉపాధ్యాయినులు, విద్యార్థినులు కలిసి జరిపిరి.

,, 12 ,, భారతదేశమంతటా మహాత్ముని అస్థిభస్మములు పుణ్యతీర్థములలో నిక్షేపింప బడినవి.

,, 13 ,, శివస్వామి అయ్యర్ సతి బాలికా పాఠశాల విద్యార్థినులు రసికరంజనీసభ హాలులో "పాదుకా పట్టాభిషేకం" అనే నాటకమును ప్రదర్శించిరి.

,, 13 ,, గాంధీశిష్యురాలు అంతస్ సలాంకన్య అనే ముసల్మాన్ బాలిక గాంధీమరణవార్త విన్న నిమిషమునుండి నిరాహార దీక్షితయై గాంధీ అస్థిభస్మములు నదిలో నిక్షేపించిన అనంతరము ప్రాశన మొనర్చినది.

,, 15 ,, అఖిలభారత మహిళామహాసభ మద్రాసు శాఖవారు సమావేశమై మత పాక్షిక తత్వమును ఖండించుచు తీర్మానించిరి.

,, 17 ,, మద్రాసు యూనివర్శిటీవారు శ్రీమతి రత్నాబాయిగారికి యం. లిట్. పట్టము నిచ్చితిమని ప్రకటించిరి.

,, 18 ,, బీగం అమీరుద్దీన్ ఎం. ఎల్. ఏ. అస్సెంబ్లీలో మద్రాసు విశ్వవిద్యాలయ చట్టమును సవరింపుమని అర్థించినది.

,, 18 ,, రెండుపెండ్లిండ్లు నిషేధించే బిల్లు సెలెక్టు కమిటీవారు ఈరోజున తమపని ముగించినారు. వివాహముల రద్దుకు మరతు లింకను కఠిన మొనర్ప బడినవట.

,, 19 ,, బెల్జియం శాసన సభచే బెల్జియం స్త్రీలకు 21-7-1949 నుండి ఓట్లు ఇచ్చే హక్కు యివ్వబడినది.

,, 22 ,, ఢిల్లీలో పి. ఆర్. కృష్ణమూర్తిగారనే దాక్షిణాత్యుని భార్యను పాలు కొని గుమ్మంలోనుంచి తిరిగి ఇంట్లోకి పోవుచుండగా ఎవడో కత్తితో పొడిచి చంపి నగలు హరించుకొని పోయినాడు.

,, 23 ,, పాకీస్థానమునకు వలస వెళ్లిన ఢిల్లీముసల్మానుల ఇండ్లలో హఠముగా వచ్చికూర్చునిన స్త్రీశరణార్థులను ఢిల్లీపోలీసులు తరిమివేసి ఆఇండ్లను కాపలా కాయుచున్నారు.

,, 26 ,, ఏథెన్సుపట్నంలో (గ్రీసు) ఒకతల్లికి 4 గురు కవల పిల్లలు పుట్టినారు. ఆదేశపు ఆరోగ్య మంత్రి ఆమెకు నాలుగు బట్టల మూటలంపినాడు. బిడ్డలుతల్లి, ఆరోగ్యంగా ఉన్నారు. ఆమె ఇప్పటికే అర్థురుబిడ్డలతల్లి.

,, 28 ,, క్వీన్ మేరీస్ కాలేజీ విద్యార్థినుల ఆటల పోటీ జరిగినది.

# స్వతంత్ర భారతదేశపు నూతన రాజ్యాంగ చట్టము

చిత్తుప్రణాళిక.

ఇందులో మున్నుడి ఇట్లున్నది:-

భారతీయులమైన మేము భారత దేశాన్ని ప్రభుత్వాధికారయుత ప్రజారాజ్యము (Sovereign Democratic Republic) గా నేర్పరచడానికిన్నీ - అందలి ప్రజలందరికీ ఈక్రింది ప్రయోజనములు సాధించడానికిన్నీ - హృదయపూర్వకముగ తీర్మానించినాము:- సాంఘికముగా, రాజకీయముగ న్యాయము కల్గుట; యోచించుటకు, ప్రకటించుటకు, విశ్వసించుటకు, మతధర్మము నవలంబించుటకు, ఆరాధించుటకు - స్వాతంత్ర్యముండుట; అంతస్థులోను, అవకాశములలోను, - సమానత్వమేర్పడుట. ఇంకా, వ్యక్తియొక్క గౌరవము జాతీయైక్యత సంరక్షించగల సోదర భావమున్నూ పెంపొందింప తీర్మానించినాము.

ప్రాథమిక హక్కులలో ముఖ్యముగ నీవిషయాలు చేర్చబడినవి:-

· కేవలముమతము, జాతి, కులము, స్త్రీ పురుష విచక్షణ - అనే భేదభావమును ఏపౌరుని పట్ల ఈప్రభుత్వము వహింపదు.

ముఖ్యముగా ఏపౌరుడున్నూ, కేవలము మతము, జాతి, కులము, స్త్రీ పురుష విచక్షణ - అనే భేదభావంతో,-

*(a)* అంగళ్లకు, హోటళ్లకు, కాఫీహోటళ్లకు, బహిరంగ వినోద స్థలాలకు, రారాదనే నిషేధంగాని, వచ్చినారనే నేరారోపణగాని, రాకకు హద్దులుగాని, షరతులుగాని, విధింపబడజాలవు.

*(b)* బావులు, చెరువులు, రోడ్లు, ప్రజోపయుక్తమైన ఇతర స్థలాలు ఉపయోగించుకోడానికిన్నీ - ఎట్టి ఆటంకమును వుండదు.

అయితే ప్రభుత్వమువారు **స్త్రీలకు, శిశువులకు** సంబంధించిన ప్రత్యేక సంరక్షణ మొనర్చడానికి పైసూత్రము ఆటంకప్రాయము కాదు.

ప్రభుత్వోద్యోగములకు పౌరులందరికీ సమానమైన అవకాశాలుండును.

ఏ పౌరుడున్నూ, మతము, జాతి, కులము, స్త్రీ పురుష విచక్షణ, వంశము, జన్మస్థానము-అనేవానిలో దేనివల్లగాని, -ఈప్రభుత్వముక్రింద ఏ ఉద్యోగము చేయుటకున్నూ అనర్హుడు కారాదు.

(2) పౌరులందరున్నూ ఈక్రింది హక్కులు కలిగి ఉంటారు.

*(a)* వాక్స్వాతంత్ర్యము; ప్రకటనా స్వాతంత్ర్యము.

*(b)* నిరాయుధులుగా శాంతముగా సమావేశమగుట.

*(c)* సంఘములుగా ఏర్పడుట.

*(d)* భారతదేశమంతా స్వేచ్ఛగా సంచరించుట.

*(e)* భారతదేశములో ఏప్రాంతమునగాని నివసించుట; స్థిరవాసమేర్పరచుకొనుట.

(f) ఆస్థిసంపాదించుట, అనుభవించుట అమ్మివేయుట.

(g) ఏవృత్తినైన ఏబ్రతుకుతెరువునైన అవలంబించుట, ఏవ్యాపారమునైనచేయుట.

[ఆంగ్లంలోఉన్న Citizen (సిటిజన్) అనే సామాన్య లింగవాచకపదమును తర్జుమాలో 'పౌరుడు' అని పురుషవాచకంగాచెప్పినామేగాని ఆపదము స్త్రీ పురుషుల ఉభయులకు చెందేదే. గృ॥సం॥]

# సంపాదకీయములు

## ఢిల్లీలో శరణార్థులైన స్త్రీలు:—

పాకీస్థానంలోనుంచీ హిందువులు సిఖులు ప్రాణాలకువెరచి ఇవతలవచ్చి ఢిల్లీలోపడ్డారు. వారిని చాలా వరకు కట్టుగుడ్డలతో ఎర్రనియ్యా?గానికూడా లేకుండాచేసిపంపినారు. ఇక్కడ వారికి తగినవసతులు చూపుటకు అవకాశములు క్లుప్తము. ఇన్నాళ్లున్నూ వారు చలిలోవణికారు; ఇకఎండలలో మాడుతున్నారు. వీరిలో స్త్రీలు, శిశువులు, వృద్ధులకూడాఉన్నారు. ఇక ఢిల్లీవాస్తవ్యులైన ముసల్మానులుపలువురు పాకీస్థానానికి బుద్ధిపూర్వకంగాగాని, బలవంతంమీదగాని వెళ్లినారు. వాళ్లఇళ్లువాకిళ్లు కాళీగాఉన్నాయి. బహుశా ఆచలిలో, ఎండలో వణికి, మాడిచావలేక హిందూశరణార్థులు, హఠంగానే అనండి, వచ్చి ఈకాళీఇండ్లలో బైఠాయిస్తున్నారు. ఈవిధంగా 23-2-48 న రాత్రికాలమందు 200 మంది శరణార్థులైన స్త్రీలువచ్చి పాతఢిల్లీలో ఫూల్ బంగష్‌లో కాళీగానున్న ఇండ్లలో బలవంతంగా దూరి తిష్ఠవేశారు. వారట్లా 4 గంటలున్నతర్వాత పోలీసులువచ్చి వారినితరిమివేశారు; ఆఇండ్లు కాపలాకాస్తున్నారు. ప్రభుత్వంవారిచేతిలో పోలీసుసిబ్బంది ఉన్నదికాబట్టి ఈపనిసులభమే. "చంకదుడ్డుశరణార్థి" అన్నట్లు శరణార్థులు దురుసుచేసి ఇతరులయిండ్లు ఆక్రమించడమున్నూ మేము హర్షించము. అయితే-వారట్లు చలికి, ఎండకు బాధపడవలసిరావడం, పోలీసువారు కాపలాకాయవలసినంత దిక్కుదివాణంలేక వలసపోయిన ముసల్మానులఇండ్లు పడిఉండడం-విచిత్రపు సంఘటన. ఈసంఘటనను ప్రభుత్వమువారు చాకచక్యముతో సర్దుబాటుచేసి ఆశరణార్థులు తమయజమాన్యముననే తత్కాలముగనైన ఇందునివసింప నేర్పాట్లుచేయరాదా?

## గ్రుడ్డి, చెవిటి, మూగబిడ్డలకు పాఠశాలలు:—

బిడ్డలుగ్రుడ్డి, చెవిటి, మూగవారుగా పుట్టినపుడు సామాన్యముగా తల్లిదండ్రులు తమదురదృష్టమునకు వగచుచుందురేగాని వారిని ప్రయోజకులొనర్చుట కుపాయములనరయజాలరు. చాలినవారు, జాలికలవారు తామున్నంతకాలము వారినతిగారాబముగచూచి, నిస్సహాయులుగానే వారినిదైవమునకు విడిచిగతింతురు. అయితే ఆ అంగవైకల్యముకలవారికి ఆలోటుతీర మరయొక ఇంద్రియమేదేని సామాన్యమునకన్నమించి పటుత్వమైయుండును. దానినరసి విద్యావంతులగావించినచో వారుకనీసము సంఘమునకు బరువుచేటుగాక తమపొట్టతాము పోసుకోగలరు. ఇట్టివారికి విద్యనేర్పుట యొకప్రావీణ్యము. అట్టిప్రవీణులచే వీరికివిద్య చెప్పించుట వ్యక్తులుచేయతగినపనికాదు; సంస్థలేచేయగలవు. ఇన్నాళ్లును మిషనరీలు మనదేశమున నీపని చేబట్టి నడుపుచుండిరి. ఇట్టివి మనరాష్ట్రమున 12 సాగుచున్నవట. నేడుమద్రాసు ప్రభుత్వమువారే ఈపని చేబట్టి - గ్రుడ్డివారికి రెండు, మూగ, చెవిటివారికి రెండు, పాఠశాలలనెలకొల్పనెంచుట హర్షింపదగినది. ఇందులకువారినెంతయు అభినందించెదము. అయితే ఈనాల్గుపాఠశాలలను చెన్ననగరముననే నెలకొల్పుటయా లేక, జిల్లాలలో సర్దుటయా అని ఆలోచింపదగిన విషయము. ఇట్టిబిడ్డలెక్కడనున్నను - పాఠశాల వసతిగృహముననే నివసించుచు తర్ఫీదునందవలసినవారుగాన చెన్నపురిలోనుండుటయే శ్రేయస్కరమని మా అభిప్రాయము.

## నకనకలాడే బిడ్డలకాహారం

నేడు ప్రపంచంలో ఎందరో అన్నాతురులై అలమటించిపోతున్నారు. అందులో బిడ్డల అవస్థ దుర్భరము. అయితే యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజేషన్ వారు ప్రపంచశాంతి నెలకొల్పజాలకపోయినా ఈ సమస్యను ఊహించకపోలేదు. బిడ్డల అవసరము నాదుకొనే అంతర్జాతీయనిధి నేర్పరచినారు. ఈనిధివారు ప్రపంచమంతటా కొన్ని కేంద్రముల నేర్పరచి బిడ్డలకు ఉపాహారములనిచ్చి కాపాడుతున్నారు. ఈనెలలో వీరియాజమాన్యమున 50,000 సెంటర్లనుండి 4000,000 బిడ్డలకు ఈ ఉపాహారములు సప్లైకాగలవన్న వార్త కరుణార్ద్ర హృదయులనేగాక, కఠినహృదయులనుకూడ మెత్తపరచగలది. ఆ ఉపాహారము లిచ్చేకాలానికి ఆ 50,000 కేంద్రములలో ఆ 4000000 బిడ్డలు చేతులుజాచి వానికై పాత్రలాడుచున్న దృశ్యమునూహింపగలవాడు, ప్రపంచమునంతయు అల్లకల్లోలపరచి వీరినీస్థితికి తెచ్చిన యుద్ధముమాట తిరిగితలపెట్టగలడా? ముఖ్యముగా 10 సం॥లనుంచీ యుద్ధములో మునిగితేలుతున్న చీనాలో ఈ సమస్యమిక్కుటమట. 35 లక్షల డాలర్లు ఖర్చించి రాగల వసంతకాలంలో చీనాలో ఒకస్కీము నమలుజరుపదలంచియున్నారు. ఈ కార్యము చేబట్టి నడుపుచున్నవారు ఎల్లరకు వందనీయులు.




## అబలా సచ్చరిత్ర రత్నమాల.

కీ॥ శే॥ శ్రీ భండారు అచ్చమాంబగారు ఈ శతాబ్దారంభమున వ్రాసి ప్రకటించిన వ్యాససంపుటికిది పునర్ముద్రణము. దీనిని విమర్శనార్థమై మా కార్యాలయమునకంపిన శ్రీ కొమర్రాజు వినాయకరావుగారికి మేమెంతయు కృతజ్ఞులము. సుమారు 350 పుటలలో నీవిద్వత్తిలకము - 34 గురు ఉత్తమ స్త్రీరత్నముల చరిత్రల పొందుపరచినది. వాటన్నిటికిని మణిపూసగా శ్రీ పులుగుర్తి లక్ష్మీనరసమాంబగారు రచించిన అచ్చమాంబగారిచరిత్రయు నిందుపొందుపరుపబడినది. ఈ గ్రంథము సులభశైలిలో చక్కనిచిక్కనిభాషలో వచనమున వ్రాయబడినది. ఆయావ్యక్తుల జీవితమందలి ముఖ్యమగు ఘట్టములనే ప్రస్తావించి వానిప్రాశస్త్య ముగ్గడించుచు చరిత్రలు వ్రాయబడినవి. అన్నియు నాదర్శప్రాయములగు జీవితములే. అందరు చారిత్రక వ్యక్తులే; పౌరాణికయుగము వారొక్కరున్నూ లేరు. అందుచే "తగుప్రయత్నమున అంతవారము కావచ్చు" నను ధైర్యము ఉత్సాహము ప్రతిపాఠకురాలికి కలుగుననుటకు సందేహములేదు. ముఖపత్రమున అశ్వారోహణ మొనర్చి యుద్ధభూమికరుగుచున్న వీరనారి ఝాన్సీ లక్ష్మీబాయి త్రివర్ణచిత్రము ముద్రితమైయున్నది. వెల రు. 2-8-0 లు. మాత్రమే. వలయువారు శ్రీ కొమర్రాజు వినాయకరావుగారు, అభ్యుదయ ప్రెస్, గవర్నరుపేట, బెజవాడ అని వ్రాసిన బడయగలరు.

## ప్రపంచదర్శిని (Andhra directory & year book) 1947-48

శ్రీ కప్పగంతుల సత్యనారాయణగారు ప్రచురించిన 1947-48 సం॥ ము ప్రపంచదర్శిని (Andhra dirrectory & year book) పంపగా కృతజ్ఞతతో స్వీకరించితిమి. ఇట్టిపుస్తకము తెలుగులో అత్యవసరమని చిరకాలంనుంచీ పలువురు అనుకుంటున్న సంగతే కాని సాహసించి ప్రథమంలో ప్రకటించినవారు వీరే అనవలెను. ఇందులో ఆంగ్లభాషలో ప్రచురమైన (Year books) (సంవత్సరసంచికల) లో ప్రచురమయ్యే విషయములన్నీ దాదాపుగా వున్నవనవచ్చు. అయితే వ్రాసినవిషయాలను వ్రాయబడినపద్ధతీ చూస్తే - ఆంగ్లభాషాపరిచయం అంతో యింతో కలవారికి ఇదిఎక్కువగా ఉపకరిస్తుందేమోనని తోస్తున్నది. కాని ఇది ప్రథమ ప్రయత్నంగనుక - అలోపంగొప్పదికాదు. ఈసారిముద్రణలో విషయములు కొన్నితగ్గించినా - చెప్పబడిన విషయములను ప్రయోజనకరముగా తెలిసి నిత్యజీవితంలో వాడుకొనడానికి వీలైనవివరణములుకూడా చేర్చడంఅవసరము. ఆంగ్లభాషాపరిచయం ఏమీలేనివాడికి - అత్యవసరమున్నూ అత్యుపయుక్తమున్నూ అగునట్లు దీన్నితీర్చిదిద్దవలెను. అది కొనసాగేసరికి కొన్నిసంవత్సరములు పట్టవచ్చును. మొత్తానికి శ్రీ సత్యనారాయణగారి కృషికీ, సాహసానికీ వారినిమేము మెచ్చుకొంటున్నాము. "ఎవరెవరు" అనే భాగంలో - సుప్రసిద్ధులైనవారి సంగతేగాక అజ్ఞాతులయ్యు ఉదతాభక్తి ప్రజాసేవ చేసేవారినిగూర్చికూడా వీరప్రస్తావించడం వీరిఉదారస్వభావాన్ని తెలుపుతుంది. దీని విలువ రు 4-0-0 లు. ఈ కాగితానికి, ఈ అచ్చునకు ఈ రోజులలో ఇది హెచ్చుకాదు. వలయువారు కథామాల ప్రచురణాలు 1/5 వీరభద్రదా వీధి, మైలాపూరు మద్రాసు 4 అని వ్రాయండి.

---

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor: Dr. K. N. Kesari.




Grihalakshmi, April, 1948.

## శ్రీ సర్వధారినాము సం॥ర చైత్ర మాసము.

| | | | |
|---|---|---|---|
| | 10 | శ | శుద్ధ పా. 31-12 అశ్వి 49-28 వక్రత్యాగః శ్వేతవరాహకల్పః ఉగాది |
| | 11 | ఆ | ద్వి. 31 53 భ. 51-15 వేదవ్యాసతీర్థానాం దక్షిణశృంగోన్నత చంద్రోదయం. |
| | 12 | సో | త. 31-8 కృ 51-46 సౌభాగ్యగౌరీవ్రతం. |
| | 13 | మం | చ. 29-3 రో. 51-5 విష్ణుపత్పుణ్యకాలం. |
| | 14 | బు | పం. 25-53 మృ. 49-12 |
| | 15 | గు | ష. 21-37 ఆర్ద్రా. 46-22 తిథిద్వయం. |
| ఏప్రిల్ | 16 | శు | స. 16-23 పున. 42-40 అశోకాష్టమి. |
| | 17 | శ | అ. 10 36 పుష్య. 38-24 శ్రీరామనవమి. |
| | 18 | ఆ | న. 4-18 ఏష్యం 53-27 ఆ. క్రే. 33-52 |
| | 19 | సో | ఏ. 51-15 మ. 29-18 |
| | 20 | మం | ద్వా. 45-9 పూఫ. 25-0 |
| | 21 | బు | త్ర. 39-41 ఉఫ. 21-12 అనంగత్రయో; సత్యప్రియతీర్థా. |
| | 22 | గు | చతు 35-4 హ. 18-9 హ. 35-35 |
| | 23 | శు | ○ పౌ. 31-24 చి. 16-2 వ మదనపూర్ణిమా వసంతోత్సవం. |
| | 24 | శ | కృ॥ ప్ర॥ 23-55 స్వా 15-2 |
| 1948 సం॥ | 25 | ఆ | ద్వి. 27-39 విశా. 15-14 భానువిదియ-పార్థసారథి గరుడోత్సవం. |
| | 26 | సో | త. 27-37 అనూ. 16-38 |
| | 27 | మం | చ. 28-47 జ్యే 19-15 సంకటచతుర్థి. |
| | 28 | బు | పం. 31-2 మూ. 22-56 మత్స్యజయంతి. |
| | 29 | గు | ష. 34-14 పూషా. 27.33 |
| | 30 | శు | స. 38-9 ఉషా. 32-53 |
| | 1 | శ | అ. 42-33 శ్ర. 38-43 |
| | 2 | ఆ | న 47-9 ధ. 44-45 త్యజ్యోభావః |
| | 3 | సో | ద. 51-40 శత. 50-44 |
| మే | 4 | మం | ఏ. 55-51 పూభ . 56-25 స్మార్తానామేకాదశీ. |
| | 5 | బు | ద్వా. 59-26 ఉభా. 60 10 వైష్ణవేకాదశీ. |
| | 6 | గు | త్ర. 60-10 ఉభా. 1-21 వరాహజయంతి. |
| | 7 | శు | త్ర. 1-56 రే. 5-33 కర్తరీప్రవేశం-మాసశివరాత్రి |
| | 8 | శ | చతు. 3.32 అశ్విని. అమాతర్పణం. అన్వాధానం. |
| | 9 | ఆ | ● అమా. 3-59 భ. 10-42 పిండపితృయజ్ఞః |